కళాభివర్ధనీపరిషత్తు

# వారకాంత

౬ అంకముల నాటకము



పండిత

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రణీతము

కళాభివర్ధనీపరిషత్తు



౨౮ ]

కలాభివర్ధనీపరిషత్తు

# వారకాంత

౬ అంకముల నాటకము


పండితశ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రులవారిచే

రచియింపఁబడినది



రెండవ కూర్పు

కలాభివర్ధనీపరిషత్తునుండి

ప్రకటింపఁబడినది

౧౯౩౪

సర్వస్వామ్యసంకలితము     వెల ౧—౦—౦




మల్లిడి సత్తిరెడ్డి గారిచే

రాయవరమున శ్రీ మేరీముద్రాశాలలో

ముద్రింపఁబడినది

# కళాభివర్ధనీపరిషత్తు



## రాజపోషకులు

మ. రా. శ్రీ శ్రీరాజా పాయని వేంకటరంగారావుబహద్దరువారు మదరాసు

## పోషకులు

| | | |
|---|---|---|
| మ. రా. శ్రీ | దామెర వేంకటలక్ష్మీనరసింహారావుగారు | వీరవరము |
| ,, | సబ్బెళ్ల పద్దయ్యగారు | కొంకుదురు |
| ,, | వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు | మదరాసు |
| ,, | తూములూరి శివరామయ్యగారు బియే బియెల్ వకీలు | నెల్లూరు |
| ,, | పొణకా శేషారెడ్డిగారు | పొట్లపూడి |
| ,, | తిక్కవరపు రామరెడ్డిగారు | నెల్లూరు |
| ,, | పొణకా వీరారెడ్డిగారు | అల్లూరు |
| ,, | మల్లిడి సత్యనారాయణరెడ్డిగారు | కుతుకులూరు |
| ,, | ద్వారంపూడి రామారెడ్డిగారు | అనపర్తి |
| ,, | కత్తి చిన వేంకటరెడ్డిగారు | రంగూను |



# కథ

అనగనగా కల్లూరి వేంకటరావు అని ఒక బ్రహ్మచారి రాజమహేంద్రవరములో ఉండేవాడు. బియే పరీక్షకు చదువుచుండగా అతనికి ఒక వితంతువుమీద మోహము కలిగినది. అంతట అతడు యుక్తిచేసి ఆమె యింటికి రాకపోకలు మొదలు పెట్టెను. వేళాకోళాలు లోకాభిరామాయణాలు ప్రారంభమైనవి. ఇంట్లో ఎవరునులేనప్పుడు ఇద్దరూ కూడా కలిసికొన్నారు. పెండ్లి నిశ్చయమైనది.

అయితే మరునాడే ఆమె మేనమామ యింటికి కాకినాడ వెళ్లవలసి వచ్చినది. అక్కడ ఆమెకు జబ్బుచేసి హెచ్చుకాగా తండ్రి రాజమహేంద్రవరము తీసికొనివచ్చెను. వేంకటరావు ఆమెను చూచుటకు వెళ్లి మంచము మీదనే కూర్చుండెను. ఆమె అతని చేతులలో తన చేతులనుంచి ప్రాణములు విడిచినది.

తరువాత అతడొకనాడు కోటిలింగాలకు స్నానమునకు వెళ్లి వచ్చుచుండగా ఒక బీదబ్రాహ్మణునిమీదనుండి గుఱ్ఱపుబండిపోయెను. వేంకటరావు అతనిని ఆసుపత్రికి తీసికొనివెళ్లెను; గాని అతడు బ్రతుకలేదు. చచ్చిపోవుచు ఆబ్రాహ్మణుడు తన కొమార్తెను వేంకటరావునకు అప్పగించెను.

ఆమె అతని యింట చాల నమ్మకముగా పెరుగుచుండెను. వేంకటరావునకు ఇద్దరుముగ్గురు పిల్లనిచ్చెదమనివచ్చిరి. తుదకాతడు ఆమెను పెండ్లియాడుటకు నిశ్చయించుకొనెను. వేంకటసోమయాజి అనే స్నేహితుడు ఆమెను వేంకటరావునకిచ్చి మహావైభవముతో పెండ్లిచేసెను.

ఈకథ చాల చమత్కారముగా పెంచి వ్రాయబడినది. గ్రంథము. పేరు అనాథబాలిక. అచ్చులో నున్నది. వెల 0—12—0

## కళాభివర్ధనీ పరిషత్తు

రామవరము. గోదావరిజిల్లా

# కలాభివర్ధనీపరిషత్తు

రాయవరము—గోదావరిజిల్లా

యజమానులు పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ఈపరిషత్తునుండి నవలలు, నాటకములు, పద్యకావ్యములు, చరిత్రలు, విమర్శనములు మున్నగు గ్రంథములు ప్రకటింపఁబడుచున్నవి. మాగ్రంథములు అన్నియు అద్భుతకథా కల్పనా విలసితములై, మనోహరవర్ణనా బంధురములై, సముదారభావ పూరితములై, మనోజ్ఞపదలలితములగు సిద్ధుష్టభాషలో వ్రాయఁబడి తళతళలాడు వెండిరేకులవంటి కాగితములమీఁద మిలమిల మెఱయు ముత్యములఁబోలు అక్షరములతో ముద్దులు మూటగట్టు నట్లుముద్రింపఁబడి ప్రకటింపఁబడుచున్నవి. మాపరిషత్తునుండి

# ప్రబుద్ధాంధ్ర

అను సచిత్రమాస పత్రిక గూడ ప్రకటింపఁబడుచున్నది. ఈపత్రికను పెద్దపెద్దలు చాల ఘనముగా పొగడియున్నారు. ఇందు వ్యాఖ్యానములు అను శీర్షికక్రింద లోకవృత్తములు చాల చక్కఁగా విమర్శింపఁబడుచున్నవి. సంవత్సరమునకు

చందా 2—0—0

# గీతమంజరి

ఈపేరుతో వివిధవిషయములను గుఱించి వ్రాయంబడిన గీతములు ప్రకటింప బడినవి. ఇందలి లేఖినీగీతము, కర్షకగీతముమున్నగు వానినిఅనేకులుమెచ్చుకొనియున్నారు. రెండవ కూర్పు అచ్చులో నున్నది. వెల 0—8—0

## పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

### వ్రాయంబడిన యితరగ్రంథములు

| | | |
|---|---|---|
| వీరపూజ | భారతీయవీరుల చరిత్ర | 1—0—0 |
| శ్మశానవాటిక | పేరుపొందిన నవల | 1—0—0 |
| మిథునానురాగము | పొగడ్తలందిన నవల | 0—12—0 |
| రామదేవవిజయము | నాటకము | 0—6—0 |
| సాహసికరాజపుత్రము | ,, | 0—6—0 |
| శృంఖల | విమర్శనము | 0—6—0 |
| విజయనగరరాజులకథలు | | 0—8—0 |
| చిత్తూరురాజులకథలు | | 0—4—0 |
| ఢిల్లీచక్రవర్తులకథలు | | 0—4—0 |
| గోల్కొండనవాబులకథలు | | 0—2—0 |

కలాభివర్ధనీపరిషత్తు — రాయవరము — గోదావరిజిల్లా.

# పీఠిక

ఈ గ్రంథముయొక్క పేరును బట్టి యిది రెండవకూర్పు; గాని మొదటి కూర్పునకును దీనికిని ఏమియు సంబంధము లేదు. కథ అంతయు మారినది. పాత్రలు కొన్ని క్రొత్తవి చేర్పఁబడినవి. ప్రాఁతవి కొన్ని తొలఁగింపఁబడినవి. ఈతీరున అన్నివిధములను ఇది క్రొత్తనాటకము. ఇది మొదటి కూర్పు.

ఇది శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావుబహాదరు వారి వారకాంత అను గ్రంథమును అనుసరించి వ్రాయఁబడినది; గాని మూలకథకును, దీనికిని చాల వ్యత్యాసము ఉన్నది. కొన్ని కారణముల వలనకథయిప్పటివఱకును కొనితేఁబడినది. గ్రంథము చదువునపుడు పాఠకులకు ఆవిషయము విశద మగును.

చాల కాలమునుండి దీనిని ప్రకటింపనుత్సాహము కలదు. అది యిప్పటికి నెఱవేఱినది. ఈచిన్ని నాటకమును విన్రీతుఁడనై ఆంధ్రసోదరుల యెదుట నుంచుచున్నాను.

మహేంద్రవాడ — ఇట్లు

దుందుభిమాఘపూర్ణిమ — గ్రంథకర్త

# ఇందలి పాత్రలు

## పురుషులు

కేశవరావు
రామదాసు
నారాయణశాస్త్రి
గోపాలశాస్త్రి
వేంకటరాయఁడు
వెంకయ్య
సుబ్బారాయఁడు
వేంకటరావు
సుబ్బయ్య
వెంకన్న

## స్త్రీలు

లక్ష్మి
పద్మాక్షి
కనకాంగి
పాప
చతురిక
పార్వతి

శ్రీ

# వారకాంత

## నాందీ—ప్రస్తావన

శ్రీకలితుండ నైతి సరసీజముఖీ, సగమేనఁ దాల్చి నిఖి
లోకము లెల్ల మెచ్చ నని లోలత నన్గొనియాడియాడి, మా
యాకలితుండనై శిరమునందు మఱొక్కతెఁ దాల్చి తన్నగా
రీకమలాస్య ముద్దుగొని ప్రేమముఁ జూపు భవుండు ప్రోచుతన్

సూత్రధారుఁడు—(ప్రవేశించి) అదిరా, ఇంకను నిశ్చితసమయము గాలేదు. అయిన నప్పుడే నాటకశాల యంతయు నిండి క్రిక్కిఱిసిపోయినది. నటరాజానుగ్రహమా? రూపకనాథప్రభావమా యిది? బళా, నేఁడిచ్చటఁ జేరి నవా రందఱును రసికులే. మాప్రయాస వ్యర్థము గాదు. (ముందునకేఁగి జూచి చేతులు జోడించి) రసికుల యెదుట ఇది విజ్ఞాపనము.

గీ. కార్యపరతంత్రులగువారి గౌరవమ్ము
బుధులగు విమర్శకుల రుచిమూలకమ్ము;
చెలిమి, పగయును మూలమ్ము సేయకున్న
నదియె గరువమ్ము, కర్తల కదియె పూజ.

కాలము వాయువేగమనోవేగములఁ జనుచున్నది. మాయుత్సాహమును అందుల కనురూపముగ పొంగి పొరలు చున్నది. నతులు నే నేల ఆనకట్టలు వేయవలెను? ఇదిగో తరలితిని—

(పోఁబోవుచు)

నటుఁడు—(ప్రవేశించి—సూత్రధారుని జేయిపట్టుకొని నిలిపి) బావా,

తొందర వలదు. గంట యోర్చినవారికి నిమిషము కష్టము గాదు. సభాస్తారుల యెదుటఁ జదువు మని గ్రంథకర్త పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి యీచీటి నంపెను.

( ఇచ్చును )

సూత్రధారుఁడు—( అందికొని ) ఇదే చదువుచున్నాను. ఓసభాసదులారా,

గీ. నూతనగభీరభావబంధురులు మీరు
గోల సుకుమారి నాకవితాకుమారి;
ముగ్ధ తెపిబుంద డాఁగిలిమూఁత లాడు
భావకౌముది విహరింపఁ బ్రార్థనమ్ము.

ఇంక నొకటి;—

చ. గతిచెడి, నీతిమాలి, మనకంటె నొకించుక హెచ్చుగా నధః
పతనము గన్న రోఁచెలుల వర్తనముల్ సరిసేయఁగా బహి
ష్కృతి కరణీయమో, చదువు చెప్పి వివేకము గొల్పి కూర్మి నం
చితగతి నేర్ప నౌనో, యెటు సేయుట ధర్మమొ చర్చ సేయుఁడీ:—

(నిష్క్రమించును



## ప్రథమాంకము—ప్రథమరంగము

### ఊరిబైట శివాలయపు కోనేరు గట్టు

( సుబ్బారాయుఁడు, వేంకటరావు కూర్చుండియుందురు )

వేంకటరావు—సుబ్బారాయఁడుగారూ, ఇంతకును బోగమువాళ్లు అంటే మీకంత పట్టుదల యెందులకు?

సుబ్బారాయఁడు—మిమ్మే నేనడిగే మాటగూడ అదే. ఏదో పూర్వు లేర్పఱిచిన నియమము. దానిని మనము ఉపయోగించుకొనకున్న మానె, దుర్వినియోగము చేయకుండినఁ జాలును.

వేంకట—అయితే పూర్వు లేర్పఱిచినంత మాత్రమున ఈకాలమున దానిని మనము అంధప్రాయముగ అనుసరింపవలసినదేనా? మన బుద్ధికుశలతకు వినియోగము వలదా? మన స్వాతంత్ర్యమును నిలుపుకొనవక్కఱ లేదా?

సుబ్బా—బుద్ధికుశలతను వినియోగించుకొనుటకును, స్వాతంత్ర్యమును నిలుపుకొనుటకునుమూలము పూర్వులనిర్ణయమును తలక్రిందులు సేయుటయేనా?

వేంకట—సంస్కరణము అక్కఱ లేదంటారా మీరు?

సుబ్బా—చేయఁడి. అయితే దానికి మీకు ఒరవడి యేమి?

వేంకట—చూడండి పాశ్చాత్యసంఘమును?

సుబ్బా—నేనుగూడ అదే చెప్పుచున్నాను. చూడండి పాశ్చాత్య సంఘమును.

వేంకట—మీయభిప్రాయము నాకు తెలియుట లేదు.

సుబ్బా—పాశ్చాత్యులలో నృత్యమును, అభినయమును ఉన్నవి గావా?

వేంకట—అవును.

సుబ్బా—అవిగూడ మనకు ఉండవలెనా అక్కఱలేదా?

వేంకట—ఉండవలెను.

సుబ్బా—వానిని వారెట్లు ఉపయోగించుకొనుచున్నారు? వారి నృత్యమును మీరు చూచియేయుందురు.

వేంకట—చూచినాను. చాల ఆనందమైనది.

సుబ్బా—వారు నూర్గురో, ఇన్నూర్గురో చేరినంతమంది స్త్రీలును పురుషులును కలిసి—ఒక స్త్రీయు, నొకపురుషుఁడును కౌఁగిలించుకొని నృత్యము సేయుదురు. ఎవనిభార్యతో వాఁడు నృత్యము సేయఁగూడదు. ఒకమాఱు నృత్యము చేసిన వారితో రెండవమాఱు నృత్యము సేయగూడదు. ఈసంగతులుగూడ మీకు తెలిసియుండును.

వేంకట—తెలియును.

సుబ్బా—మఱి మనలోఁగూడ నృత్యకళ ఉండవలెనుగాదా?

వేంకట—ఉండవలె ననుటకు ఇది రెండవమాఱు.

సుబ్బా—నాకు బోధపడుటకు అడిగినదే పదిసార్లు అడుగుట అల వాటు. తమకు కోపము వద్దు. మనసంఘములో భోగమువాళ్లు—అనగా అకులముసంగతి గాదు. పెండ్లిచేసికొనకుండ సానులుగా నుండు స్త్రీలు ఉండఁగూడదుగాదా?

వేంకట—మేము పట్టుదలతో వాదించే విషయ మదే.

సుబ్బా—చిత్రము. మఱి మననృత్యకళకు వినియోగ మెట్లు?

వేంకట—(ఆలోచన నభినయించుచు) ఇది యోచింపతగినదే.

సుబ్బా—అంత యోచన యెందులకు? పాశ్చాత్యులలో మన వేశ్యల జాతివంటి ప్రత్యేకజాతి యొకటి లేదు; గాన మనలోఁగూడ వలదు. వారు ఒకని భార్య నొకఁడు కౌఁగిలించుకొని నృత్యము చేయుదురు; గాన మన ముగూడ—అట్లే—

వేంకట—(మొగము చిట్లించుకొనును)

సుబ్బా—ఏమి? చూడండి పాశ్చాత్యులను?

వేంకట—మనము నృత్యమునే తీసివేసికొనిన బాధ యేమి?

సుబ్బా—బలే! అయితే స్వామీ! పాశ్చాత్యులు ఒకని భార్యను ఒకరు కౌగిలించుకొనుటకైన నంగీకరించినారు; గాని నృత్యము తీసి వేసికొనలేదే?

వేంకట—అట్లని మనలో వ్యభిచారమున కని ప్రత్యేకముగ నొక జాతి యుండవలసినదేనా?

సుబ్బా—వేశ్యల వృత్తి వ్యభిచారమే యని మీరెట్లు చెప్పెదరు?

వేంకట—ఇప్పుడు వారు చేయుచున్న దేమి?

సుబ్బా—నృత్యమును అభినయమును సభలలో ప్రదర్శించి మనల నానందపెట్టి ఎంతో కొంత ధన మార్జించి కాలము పుచ్చుట.

వేంకట—వారు వ్యభిచరించుట లేదా?

సుబ్బా—భర్త లుండినను వ్యభిచరించు సంసారిణుల సంగతి?

వేంకట—(శిరఃకంపము గావించి) సరే మీయుపన్యాసము కానిండు.

సుబ్బా—భారతజాతియొక్క సాంప్రదాయములు వేఱు. ఇతరజాతుల కన్నిటికిని సాంప్రదాయములలో నేదో యొకింత సంబంధము ఉన్నది; గాని భారతజాతిని బోలినది మఱిలేదు. అన్నివిషయములయందును దీనికి ప్రత్యేకతయే. కుండలు చేయుట కొక జాతి. రెండవజాతివాడు దానిని చేయడు. బట్టలుతుకుట కొక జాతి. అయుష్కర్మ చేయుట కొక జాతి. బట్టలు నేయుట కొక జాతి—

వేంకట—వ్యభిచరించుట కొక జాతి.

సుబ్బా—అదే పొరబాటు. భారతదేశమున వర్ణాశ్రమాచారధర్మముల నేర్పఱిచినవారిమీద మీకెంత కోప మేల కలిగినదో తెలియదు. భోగము వారిమీద మీకిట్టి కటాక్ష మేల కలిగినదో తెలిసికొనజాలకున్నాను. వేశ్యాకులము వ్యభిచరించుటకు గాదు.

వేంకట—(తలయూపి) సరే చెప్పండి.

సుబ్బా—ఇప్పటికిఁగూడ ఆనిబంధన ప్రకారము ఎవరి వృత్తిని వారే

చేసికొనుచున్నారు.

వేంకట—లేదు. మదరాసు నగరాలలో బట్టలుకుట్టువారందఱును నాకఁఱ్ఱుగారు. ఆ క్షౌరకర్మ చేయువారందఱును మంగళ్లుగారు. వారిలో పిళ్లలున్నారు. మొదలియారులున్నారు. నాయఁడులున్నారు. తురకలున్నారు.

సుబ్బా—అట్లే నృత్యమునుగూడ ఇతరస్త్రీలు—

వేంకట—అదేమన్నమాట? అది వ్యభిచరించు స్త్రీలలోనున్న విద్య.

సుబ్బా—అయితే వ్యభిచారమును మీరు విడిచిపెట్టరు కాబోలు.

వేంకట—(పెద్దఁ నవ్వునవ్వి) అతికినది శ్లేష.

సుబ్బా—అయితే యుక్తికూడ అతుకవద్దా? మీరు పాశ్చాత్యులను గుఱిపెట్టుకొని సానులు ఉండకూడదనుచున్నారు. వారినే గుఱిపెట్టుకొని మన సంఘము — స్త్రీపురుషులు కలిసియుండి నృత్యము చేసి ఏల యానందింపఁగూడదు?

వేంకట—ఇందులకు నేను అంగీకరింపను. పాశ్చాత్యదేశములయందలి శీతోష్ణస్థితి వేఱు. మనదేశపు శీతోష్ణస్థితి వేఱు. వారి యాచారములన్నీ మనకు వ్యతిరేకమే. మనదేశమున స్త్రీల కంతటి స్వేచ్ఛ యిచ్చుటకు వీలు లేదు. మన సంఘము అందులకు అంగీకరింపదు.

సుబ్బా—ఎవరో కొందఱు మీవంటి స్వకుక్షిపక్ష నిర్ధూమధాములు—కోపము వద్దు, వలదనిన నృత్యాభినయములను విడిచిపెట్టుకొనుటకును, వానియందు ఆఱితేఱిన వేశ్యల నాదరింపకుండుటకును మాత్రము సంఘము అంగీకరించునా? పాశ్చాత్యదేశముల శీతోష్ణస్థితులు వేఱయినచో పాశ్చాత్యసంఘము మన కుదాహరణము కావచ్చునా? అక్కడ పదునాఱేండ్లు దాఁటనిదే కన్యలు రజస్వలలు కారు. మఱి యిక్కడ గూడ అట్లగుట కేర్పాటులు చేయఁగలరా? వారి యాచారములన్నీ మనకు వ్యతిరేకమే అంటారు గాని వారివలె నుండవలెనని ఉబలాట మెందులకు?

వేంకట—అట్లని పాశ్చాత్యులను అనుకరింపవలదంటారా?

సుబ్బా—ఎందులో? ధైర్యస్థైర్యములయందు, పట్టుదల యందు, స్వదేశమతాభిమానములయందు, ఇంకను మన సంఘమునకు వినాశకములు కాని యిట్టి సకలవిషయములయందు ననుకరింపుఁడు. అట్లు అనుకరించిన మన మింతకు ముందే బాగుపడియుండమా?

వేంకట—సరే. ఇదంతా మఱియొక విషయము. సంసారిణులు పురుషులతోఁ గలిసి గాని, ప్రత్యేకముగ గాని సభలలో గాని మఱియెక్కడను గాని నృత్యము చేయఁగూడదు.

సుబ్బా—నృత్యాభినయములనుగూడ విడిచిపెట్టఁగూడదన్న మాటేనా?

వేంకట—అ—న్న—మా—టే—మ—ఱి

సుబ్బా—సానులు ఉండఁగూడదాయె. సంసారిణులు గజ్జె కట్టఁగూడదాయె. ఇఁక సంసారిణీలు అయ్యుండియు వ్యభిచరించువారం దున్నారు; గాని సభలకు వచ్చి నృత్యము చేయలేరు. అభినయింపలేరు.

వేంకట—అవి చిన్నతనమునుండియు నలవాటు కావలెను.

సుబ్బా—తుదకన్ని మీరే చెప్పెదరు. నిజముమాత్రము అంగీకరింపరు. ఒకవేళ ఏసంసారిణియైన—వ్యభిచారము చేయుచున్నది సుమండీ. నృత్యము సేయునేని, అభినయింపఁగల దేని ఆసభలోఁ గూర్చుండుట మనకు తప్పు. అది అవమానకరము.

వేంకట—ఏల?

సుబ్బా—పాశ్చాత్యులు గూడ పెండ్లియాని నృత్యమునే యావజ్జీవమును ప్రధానవృత్తిగాఁ బెట్టుకొనిన స్త్రీని ఆకళలో నారితేరినవో బ్రహ్మరథము గూడఁ బట్టెదరు. గాని వ్యభిచారము వృత్తిగాఁ బెట్టుకొనిన అంగీకరింపరు.

వేంకట—వారికి వ్యభిచారము పనికిరాదు

సుబ్బా—ఎందుకులెండు. ఒకజాతిని గుఱించి మఱియొక జాతివారు సూక్ష్మవిమర్శన చేయఁగూడదు.

వేంకట—దానికేమిగాని వీరేశలింగముపంతులుగారు ఆకాలములో

ఈ వేశ్యలను గుఱించి చాలపని చేసినారు. అప్పుడు వేశ్యలనోళ్లలో కరక్కాయలు పడినవి. విటుల యాటలు కట్టుపడినవి.

సుబ్బా—ఇప్పుడో?

వేంకట—వేశ్యలదే రాజ్యముగా నున్నది. విటులకు లోటు లేదు.

సుబ్బా—కారణము?

వేంకట—పంతులుగారి యనంతరము మఱల అంతటివారు ఈ యుద్యమమును చేపట్టక పోవుటచేతనే.

సుబ్బా—అదే భ్రాంతి. పంతులుగారి కాలములో భోగమువాండ్రు మన్నుగొట్టుకొనిపోలేదు. విటులు తగ్గిపోలేదు. "మేము భోగముమేళము ఉన్న సభకుపోము" అని ప్రకటనపట్టినవారు;—"ఈ వ్రతము జీవితాంతమువఱకు కొనసాగింతుము" మని నిండుసభలలో సంతకములు చేసినవారు, ఈ యుద్యమమున పంతులుగారిచే మెచ్చుకొనఁబడినవారు కొందఱు—కొందఱు మాత్రమే—ముఖ్యులు సుమండీ—నాఁటినుండి నేఁటివఱకు సానులను విడువలేదు—

వేంకట—అక్రమము. మీరు వచ్చి అబద్ధము లాడుచున్నారు.

సుబ్బా—ఈ విషయమును తరువాత మీకు ఋజువు చేసెదను. ఇది వినండి. పంతులుగారి ప్రయత్నమువలన సంఘమున మార్పు జరుగలేదని గాదు. ఫలము కలుగలేదు.

వేంకట—ఎట్లు?

సుబ్బా—కొన్ని కుటుంబములలో శుభకార్యములకు, పండుగలకు, మిత్రుల గమనాగమనములయందు భోగముమేళములను పెట్టుట తగ్గినది. ఇంతవఱకే పంతులు ప్రతిష్ఠ. దీనివలన వేశ్యలలో గానవిద్యావైదుష్యము, నాట్యాభినయముల నేర్పు, తదభిలాషయు సన్నగిల్లినవి. రసికులకు నాట్యాభినయములయెడలఁ గల యభిలాష చంపుకొనవలసివచ్చినది; గాని విటులకు భోగాభిలాష చంపుకొనవలసిన యవసరము రాలేదు. వేశ్యలలో పడుపువృత్తి తగ్గలేదు. నాట్యాభినయముల స్థానము నది యాక్రమించినది.

వేంకట—(తలయూచి) సరే చెప్పండి.

సుబ్బా—పంతులు కలము పట్టకపూర్వము సంఘమునకు భయపడెడి విటులు కొందఱుండెడివారు. వారు వేశ్యల యిండ్లకు అతిరహస్యముగాఁ బోయెడివారు; గాని తరువాత చేసిన సంతకములకును, పట్టిన ప్రతములకును, జంకె ముసుఁగులు వేసికొని వేశ్యల కొంపల దూరు సంస్కర్తలు విటుల సంఖ్యను హెచ్చించిరి.

వేంకట—ఇందులకు నేనంగీకరింపను. ఇది అతిశయోక్తి.

సుబ్బా—తరువాత మీకిది యొకనాడు ప్రత్యక్షము కానేదను. ప్రకృతము. నాన్‌కోఆపరేషనులో వేశ్యాబహిష్కారముగూడ చేరినది. గాంధిగారు వేశ్యల వ్యభిచారమువలన ఆంధ్రదేశము కుళ్ళిపోయినదనుచున్నారు.

వేంకట—అవును.

సుబ్బా—వారు వేశ్యాబహిష్కారమును వీరేశలింగముపంతులుగారికంటెను తీవ్రముగ నుపదేశించుచున్నారు.

వేంకట—అవును.

సుబ్బా—ఫలము?

వేంకట—సున్న.

సుబ్బా—నిజము చెప్పినందులకు ఆనందము. వారి శిష్యులు, నాన్‌కోఆపరేటర్లలో ప్రముఖులు, క్రొత్తవారికి గురువులు,—ఏమిచేయుచున్నారు?

వేంకట—చీటికినిమాటికిని బోగముమేళములు పెట్టించున్నారు వేశ్యలు ముతకగుడ్డలు కట్టిన చాలును. వాండ్రను "స్వదేశీబోగమువాండ్ర"నిపిలుచుచున్నారు.

సుబ్బా—ఇంక నొక పేరున్నది.

వేంకట—గాంధిగారి బోగమువాండ్రు—

సుబ్బా—హరహరా, దేశస్థితి యిట్లున్నది. సాధ్యాసాధ్యవిచారణ లేదు. అవసరమా అనవసరమా యనుచర్చలేదు. కేవలము పాశ్చాత్యుల యను

కరణము. అది మంచివిషయములలో మాత్రము గాదు.

వేంకట—నాల్గుదినములలో మదరాసులో పెద్ద సభ జరుగుచున్నది అందు ఈవిషయము చర్చకు వచ్చును. నేను ఆసభకు వెళ్లుచున్నాను.

సుబ్బా—పోయిరండు. బాగావినవలెను.

వేంకట—మీరు వేసిన ప్రశ్నలలో కొన్ని యోచింపవలసినవి గలవు. వానిని గుఱించి విచారణ చేసెదను.

సుబ్బా—సంతోషము. మీరు వేశ్యల నుండనిచ్చినను సంతోషమే లేకున్నను సంతోషమే. నృత్యమును అభినయమును నశించిపోకుండమాత్రము చూడుఁడు. మానసంరక్షణమునకు వస్త్రములు గట్టుకొనుట అవసర మనుట యెఱుఁగని ఆటవికులు మొదలు ఇంటిలోఁగూడ స్త్రీలకు ఆపాదమస్తకము బురకాలను తగిలించియే యుంచు సంశయాత్ములనఁబడును గల సకలజాతులయందును ఈరెండుకళలకును మహోన్నత సత్కార మున్నది.

వేంకట—అవును.

సుబ్బా—సంధ్యావందనమునకు సమయ మగుచున్నది. స్వామిదర్శనమునకు వేళ యగుచున్నది. ఇఁక ఈప్రస్తావన చాలింతము. దయచేయండి ముందు సంధ్యావందనము చేసికొందము

వేంకట—నేను మఱచిపోయినాను.

సుబ్బా—ఏల? పాశ్చాత్యులు వారి మతాచారములను విడువరే?

తెరదింపవలెను

---

## ప్రథమాంకము—ద్వితీయరంగము

(అంతఃపురమున సోఫామీఁదఁ గూర్చుండి లక్ష్మి ప్రవేశించును)

లక్ష్మి—(సవితర్కముగా) నేఁడింకను నాథుఁ డేల రాఁడయ్యెను? (గడియారముఁ జూచి) తొమ్మిదిన్నర యైనది. ఇఁక పది యగునా? పదింటికి నాథునకు నిద్రాసమయమా! నేఁడు రామాయణపాఠమునకు అనధ్యాయమా?

నేడుసీతాకల్యాణము కాదూ? కాదూ? ఔనదియట్లే, ఏమి ప్రియమో అది దూరదూరమునకుఁ బోవును. వినుదానికి నాకే యిట్లున్నది. ఆసీతాముల కెట్లుండునో? (నవ్వుకొని) అయ్యో, నేను వినునంతవఱకు సీతారాములకు పెండ్లి కాదనుకొనుచున్నాను. అది యైయెన్ని యుగములైనది? అంతయు నైపోయినది; గాని నాయెదుట నేడు జానకి పెండ్లికొఱ కెదురుచూచుచున్నది. రామచంద్రున కాధ్యానమే లేదు. నేడు చూడఁగా నాథునకుఁగాఁడ నామీఁద ధ్యానము లేనట్లున్నది. (ముందునకుఁ జూచి బల్లమీఁది మల్లెపూలదండలను జూచి) నేఁడు మల్లెపూవులకు కఱవు వచ్చెనా. తెలివితక్కువ పార్వతి (ఒకదండయెత్తి) దీని కైదుపేటలు కట్టి, (ఇంకొకదండయెత్తి) దీనికిమూఁడు పేటలే కట్టినది. (యోచననభినయించి తలయూఁపి) ఇది బాగానే యున్నది. ఆలస్యము చేసినందులకు శిక్షగా హృదయేశ్వరునకు నేఁడు ఈచిన్నిదండనే వేసెదను. అంతేకావలెను. ఏమి? వేళ యేల తప్పవలయును? (తిరిగి యోచన నభినయించి) ఇది తగదు. ధర్మము గాదు. సరసము గాదు. ఇందు సుఖము లేదు. ఆనందము లేదు. నామెడలో నున్న హారమువలన నాకనులకు తృప్తి కలుగదు. హృదయమునకు వికాసము గలుగదు. ఇది ప్రాణేశ్వరుని వక్షస్స్థలము నలంకరించిన నాకెంత నేత్రానందము. ఆసౌభాగ్యమును దిలకించిన నెంత యానందము. ఈశిక్ష గాదు. నానాథుఁడు వచ్చునప్పటికి నేను పరుండి నిద్ర నభినయింతును. (అని శయ్యమీఁదికిఁ బోయి పరుండి అంతలో లేచికూర్చుండి) ఇది తగునా? నేను ప్రత్యుత్థానము చేసి కౌఁగిటఁ బొదివిపట్టకున్న నాథుని మనసు చివుక్కుమనదూ? ఏమి చేయుదును? (యోచించి) యోచనలతోడనే కాలము గడచిపోవుచున్నది. అప్పు డేమి తోఁచిన అది చేసెదను. (సవితర్కముగా) అమ్మో, మనోహరునకు కష్టముగలిగించు తలంపు గలుగునేమో?—ఊరకుండుటమంచిది. ఎట్లూ? పలుకకుండఁగనా? అమ్మయ్యో, అది నావలన కాదు. ఏమియుఁ జేయక యూరకుందును.—అయ్యో, నాకుమతి పోవుచున్నది.

(అప్పుడు కేశవరావు ప్రవేశించును)

కేశవరావు—(స్వగతము) ఇక్కడ నానిపించుకొనుట కింత పట్టినది. ఇంక నిక్కడ నెంత పట్టునో? నిజముగా నీకార్యమును గుఱించిన ప్రతిప్రయత్నమునందును నాకు తల ప్రాణము తోకకు వచ్చుచున్నది. (యోచించి) కష్టము లేకున్న సుఖము అధిక మెట్లగును?

(లక్ష్మి వెనక గుమ్మము ద్వారమువద్ద నిలిచియుండును)

లక్ష్మి—(స్వగతము) ఇంకను ఆలస్యమా?

(అప్పుడు గడియారము పదిగంటలు కొట్టును)

లక్ష్మి—(స్వగతము) అమ్మో, అప్పుడే పదిగంటలైనది. స్నేహితులతో నాటకము చూచుటకుం బోయియుందురా? (యోచించి) మెట్లవఱకును బోయి చూచివచ్చెదను.

(అని మంచము దిగి కొంచెము ముందునకు నడచి మోమెత్తి కేశవరాయనిం జూచి ఆశ్చర్యముతో)

ఇంత దొంగతనమా? (అని యాతనిం గౌఁగిలించుకొని సోఫాచెంతకు గొనిపోవుచు) ఈగదియందున నెప్పటినుండి?

కేశవ—(పలుకక మందహాసము చేయుచుండును)

లక్ష్మి—ఈవరకు నెప్పటినుండి? (అని కేశవరాయని సోఫామీఁద కూర్చుండఁజేసి తాను ప్రక్కన గూర్చుండి) ఏమి మాటలాడరూ? (అని మోము వెనకు చిఱునవ్వుతో చూచును)

కేశవ—నేఁడేమైన వింత యున్నదా?

లక్ష్మి—లేకేమి? అన్నియు వింతలే. ఇది యొక వింత— మఱియొక వింత యున్నది. నేఁడు పార్వతి మల్లెదండలు, ఒకటి పెద్దదిగను, ఒకటి చిన్నదిగను గ్రుచ్చినది. (అని పెద్దదండ కేశవుని మెడలో వేసి చిన్నదండ చేతఁ బట్టుకొని) ఇది మీకు చాల బాగుగ నున్నది. (అని మెడలోని దండను సవరించుచు)

కేశవ—(స్వగతము) నాహృదయమును రంజించుటకు లక్ష్మి యన్ని విధములఁ బ్రయత్నించుచున్నదే. దీనియెడల నేఁడు నేనప్రియము చేయవచ్చునా? (యోచించి) నిజముగ నిది అప్రియ మగునా? కాదు. లక్ష్మియెడల నేను ద్రోహము తలంచుట లేదు. ఇది అప్రియము గాదు.

లక్ష్మి—(భర్తముఖము జూచుచు) ఏమో దీర్ఘాలోచన చేయుచున్నట్లున్నది. నేఁడేమియు నప్రియము సంఘటిల్లలేదుగదా?

కేశవ—అ—ప్రి—య—మే—గా—దు. (సంకోచించుచును)

లక్ష్మి—అది యేమైన నేమి? నామనస్సు తత్తరపడుచున్నది. (హృదయముమీఁద జేయిడికొని) గుండెలు తటతట కొట్టుకొనుచున్నవి. మనస్సున కారాట మగుచున్నది. (భర్తవక్షస్స్థలముమీఁద చేయిడి) ఆహా, మీగుండెలుగూడ కొట్టుకొనుచున్నవి. ఏల? అప్రియము గాదా?

కేశవ—కాదు. అప్రియ మనుటకు వీలులేదు; గాని నెలదినముల వియోగము.

లక్ష్మి—(ఉలికిపడి) ఏమి వియోగమా? నెలదినములా? ఎవరికి? మనకు కాదుగదా?

కేశవ—మనకు గాకున్న మన గుండె లేల కొట్టుకొనును?

లక్ష్మి—నాకేమో భయ మగుచున్నది. (అని భర్త యురమునఁ దన శిరము నానించి) వియోగము రాకుండఁజేయు నుపాయములు లేవా?

కేశవ—లేవు, లక్ష్మి లేవు. (అని యామెనుబొదివిపట్టి) నేను నెలదినములు చెన్నపట్టణములో నుండవలెను.

లక్ష్మి—అయిన నేనును వచ్చెదను. ఇఁక వియోగ మేల?

కేశవ—నీవు రాఁగూడదు.

లక్ష్మి—కోర్టునకుఁ బోయెదరో?

కేశవ—కాదు. అట్లయిన నీకభ్యంతర మేమి? ఒక బొంబాయిస్నేహితుఁడు చెన్నపట్టణము వచ్చుచున్నాఁడు. ఆతఁడు నెలదినము లచ్చట

తనతో నుండుటకు రమ్మని వ్రాసినాఁడు. ఆయనగారివద్ద సెలవు తీసికొనుట గైనది.

లక్ష్మి—ఆతనికి బెండ్లి యైనదా?

కేశవ—లేదు. బ్రహ్మచారి.

లక్ష్మి—(భర్తను విడిచి నిస్పృహతోడను, ముంగోపముతోడను) అట్లయినఁ బోవుఁడు. మీకు బ్రహ్మచారులతో స్నేహము మెండాయెను. అక్కడ సెలవు పుచ్చుకొనుట కైనదనుట యిఁక మాఱుపలుకవద్దనుట కాఁబోలు. పోయిరండు. ఇంతమాత్రమున కింత యేల? (అని లేచి శయ్యామీఁదికిఁబోయి అవ్వలి మొగమై పరుండును)

కేశవ—(స్వగతము) ఇఁక పలుకరించిన ప్రయోజనము లేదు. ప్రయాణమునకు సమయము మీఱుచున్నది. (అని మెడలోని మల్లెదండను దీసి బల్లమీఁద నుంచి) లక్ష్మి సవతితోడి కాపురపు లక్షణము లప్పుడే వెల్లడించుచున్నది. (లేచి) ఇంతమాత్రమున ధైర్యము గోలుపోయిన నేమగును? ఈమె ప్రణయలహరి నాప్రణయసాగరమున సంగమించినది. ఇఁక నాక్రొత్తప్రణయవాహినికి స్వాగత మీయవలదా? (ద్వారము చెంతకు వచ్చి లక్ష్మిదెసఁ జూచుచు) నేను వెళ్లుట నీకు ప్రత్యక్షముగ నెట్లు తెలియదో యీవియోగవ్యథగూడ తెలియకుండ నట్లే కడచిపోవుఁగాక. లక్ష్మీ,

గీ. కలవు నాప్రేమలహరికి గతులు రెండు
వంచన మెఱుంగ దుశ్చింత పజ్జ నరుగ;
స్వీకరించెద శృంగారవీరభోజ్య
మలఘుదక్షిణనాయకాధ్యక్షపదవి.

(వెడలిపోవును.)

లక్ష్మి—(పరుండియే మొగ మివ్వలకు ద్రిప్పి చూచి) ఏమి? నాథుఁడు వెడలిపోయెనా? (లేచి సోఫాచెంతకు వచ్చి) చెప్పకయే పోవుటా? సెలవు అడుగనక్కఱలేమా? (బల్లమీఁది మల్లెదండను జూచి చేతులు పిసికికొ

నుము) పూలదండ యిక్కడనే యున్నదేల? నేఁడు ఈతిరస్కార మేల? (యోచించి) బొంబాయిస్నేహితుఁడా? ఇఁకను పెండ్లి కాలేదా? బ్రహ్మచారియా? (సవితర్కముగా) చెన్నపట్టణములో పెండ్లియాడునా? వితంతువివాహమైయుండునా? అయిన బొంబాయిలో వితంతువులు లేరా? నాథుఁడు ఇప్పుడు క్రొత్తగా వితంతువివాహములు చూడఁబోవునా?—ఏమయినను నాకు పల మొక్కటే. నెల దినముల వియోగము. అక్కటా,

సీ. వచ్చితి వియోగబాధ నోర్వంగలేక
యిప్పటికి నిన్న నాపుట్టినింటినుండి,
నామనోహరుని సదనమునఁగూడ
నదియె ఘటియిల్లె నాయభాగ్యమ్ముకలన.

(సోఫామీఁద కూర్చుండి) ఇఁక నెలదినములవఱకు అపూర్ణచంద్రముఁడేమి కాన్పింపదా?

(అప్పుడు పార్వతి యను పరిచారిక ప్రవేశించును)

పార్వతి—అమ్మా, చిన్నదొరగారెక్కడకుఁ బోవుచున్నారు?

లక్ష్మి—(అన్యమనస్కయై) ఎక్కడకా? ఎవరు? (చూచి) పార్వతీ నీవటే? (మఱల అన్యమనస్క యగును)

పార్వతి—(స్వగతము) నేఁడీమె వాలక మిట్లున్న దేల? (ప్రకాశము) అమ్మా, ఏమంటివి?

లక్ష్మి—పార్వతీ, బండికదలెనా?

పార్వతి—ఇప్పటికి మైలుదూరము పోయియుండును.

లక్ష్మి—అట్లా? పార్వతీ, నాకు భయమగుచున్నదే.

పార్వతి—ఏమితల్లీ, (పట్టుకొనును)

లక్ష్మి—నన్ను శయ్యచెంతకుఁ గొనిపొమ్ము.

తెరదించవలెను.

## ద్వితీయాంకము—ప్రథమరంగము



చెన్నపట్టణము—సముద్రతీరమునందలి కాముకపథము

(పాప, చతురిక అను ఇరువురు వేశ్యలు ప్రవేశింతురు)

చతురిక—(ఆశ్చర్యము నభినయించుచు) పాపా! వారముదినాలనుండి మన మిక్కడికి వస్తూవున్నాము; గాని యీసముద్రతీరము ఒకనాఁటికంటెఒక నాఁడు వింతగా కనిపిస్తూవుంది.

పాప—సుఖాభిలాషతో నలుగురూ చేరేచోట వింతల కేమికొదువ?

సీ. లలనల రూపవిలాసమ్ము లరయుచు
నెందఱో కవిరాజు లిచటఁ గలరు
కైదండ లంది చక్కఁగ విహరించుచు
నెందఱో దంపతు లిచటఁ గలరు
యువకుల మనము లుఱ్ఱూఁత లూఁగించుచు
నెందఱో తరళాక్షు లిచటఁ గలరు
కోమలాంగులఁ గాంచి గ్రుక్కిళ్లు మ్రింగుచు
నెందఱో మోహాంధు లిచటఁ గలరు
గీ. చపలదృక్పాతముల చాకచక్య మొప్ప
చూపు ప్రచ్ఛన్నవేశ్య లిచ్చోటఁగలరు
కాముకోజ్జీవకమ్ము సైకతము గలదు
ఇంక నిచ్చోట వింతల కేమి కొదువ?

చతురికా, ఇప్పు డేమున్నది? రాత్రి పదిగంటలవఱకు నుండినఁగాని యిచ్చటి వింతలు చూచుట పూర్తిగాదు. పదిదాఁటినతరువాత కొందఱు గోషాస్త్రీలు వత్తురు. అప్పుడుగూడ చూడవలసినదే.

చతురిక—అప్పుడుగూడ ఇంత జనసంఘ ముంటుందా?

పాప—వీనితో పోల్చుటకు వీలులేదు. అదీగాక. ఇంతజన సంఘము

పనికిరాకయే వారప్పుడు వచ్చుట. రసికపురుషులు లేరగో గోషాస్త్రీలు రారుగదా? పరపురుషుల కంటబడకుండుటకే అర్ధరాత్రి వచ్చువారు ఒక్క-చోట ఎట్లు చేరుదురు? ఈ సముద్రపు కెరటముల రొదలో, పండువెన్నెలయందో, కటికచీకటియందో, చల్లగాలిలో ఏకాంతమున కాలక్షేపము సుఖించుటే వారి సంకల్పము. ఈవింత జనులతోటి ఈ వినోదములతోటి వారికి పని లేదు. పని యున్నా వీలులేదు.

చతురిక—ఇది యెప్పుడూ నేను వినలేదు. ఇది యెన్నటికంటెను వింతగానున్నది. నిశీథమున నేమి విహరింతుమా?

పాప—ఏమి చేయవచ్చును? సంఘమువారం ఇట్టి సమయములయందు ఇలు వెడల నీయదు. హృదయ మిచ్చట విహరింపవలెననే కుతూహలమున విడువఁ జాలదు. నిశీథమున నిదియు, నదియుఁగూడా నెలవేలున గదా?

చతురిక—ఈ యుక్తి గడుసుదనముగానే వుంది.

పాప—ఇంతకంటే గడుసుదనపు యుక్తులున్నాయి. వానినిఁ గనులారఁ జూచితేనే సొగసు.

చతురిక—ఈ సొగసుల కేమి గాని, మనము వచ్చి వారము నాళైనది కేశవరావుకోసం ఎదురుచూడటంతోనే మనకు కాలము గడచిపోతూంది. ఈనగరమునందలి వింతలు చూడటం యెన్నడో?

పాప—ఒసే, కేశవరావుతో నీవుకూడా ఒకటిరెండుసార్లు మాట్లాడినావుగదా? ఆతని సంగతి కనిపెట్టితివా?

చతురిక—కనిపెట్టడాని కేమున్నది? ఆతనివిషయమున నాకు చాలా సందేహముగా నుంది. తండ్రి చండశాసనుఁడు. ఈతఁడు పిఱికిపంద. తండ్రి ఈయకుండిన ఈతనిచేత నొక దమ్మిడీగూడ ఉండదు.

పాప—ఆతఁడు మనలను మోసము చేయునందువా?

చతురిక—అందులకు కారణము కనబడదు.

(అప్పుడొక ఏఁబదియేండ్ల వితంతువు ప్రవేశించును)

అగునె విధాతకేని అపఖ్యాతి లేని శుభమ్ము గూర్పఁగన్?

(నేపథ్యమున)

చతురికా, ఇటు రావే.

పాప—చతురికా, కనకాంగితో ఎవరో యొక వృత్తాంతము మాట్లాడుచున్నాఁడు. పోయిరా.

(చతురిక వెడలిపోవును)

పాప—(స్వగతము) కేశవరాయని కథ యేమీ బాగాలేదు. ఈ వ్యవహార మెంతవఱకు కొనసాగుతుందో తెలియదు. “అంగడిలో నన్ని ఉన్నవి. అల్లుని నోట శని యున్న” దన్నట్లు కేశవరావునకు ఉండలేనిదేమో చాలాగలదు; గాని స్వాతంత్ర్యము లేదు. మాకు ఇట్టి యస్వతంత్రులతోడి సంబంధము వలన నొకవిధమున నష్టము. ఒక విధమున లాభము. (ఆలోచించి) నారాయణశాస్త్రి కార్యము చెడిన ఊరకుండఁగాడా? ఆతఁడు చాల యుక్తిపరుఁడు. ఆతని ప్రయత్నము రామదాసున కేమైనా తెలిసి యుండునా? అట్లయితే కష్టమే; గాని శాస్త్రి చాలా గంభీరుఁడు. అట్టివి తటస్థించి యుండదు. కేశవరావు ప్రయాణమునకు రామదాసు ఇంతవఱకూ సమ్మతించి యుండకపోవచ్చును. అయితే—మావిషయమున నారాయణశాస్త్రి యింతకష్టపడుటకు కారణమేమి? (నవ్వుకొని) కనకాంగి తన యిష్టము వచ్చినట్లు మసలుకొనును అను ఊహ. వలసినప్పుడెల్ల దానిపాట వినవచ్చును అను ఆశ; గాని వీనివలన మాకు నష్టమేమి? (గర్వముతో) నారాయణశాస్త్రి శ్రీమతి దుగ్గిరాల కనకాంగి యింటి దూతయై యుండుఁగాక. కుక్కయై యుండుఁగాక.

(అప్పుడు కనకాంగి చతురిక ప్రవేశింతురు)

చతురిక—నిన్నటి జమీందారే మళ్లీ వార్త పంపేడు. కన్నెటికము చేయుఁడట. కనకాంగి రావాలిట.

పాప—ఏమయినది?

చతురిక—ఇక్కడ నెలజీతము లుంటామనీ, మా పంతులు గారు

ఏమతియున్నాఁడు కబురంపుతామనీ, చెప్పినాను.

పాప—బాగున్నది. చతురికా, చూడు. ఏది యెప్పటికో తెలియదు గదా?

ఆ. వె. పెంచియుండునాఁడు పిటులు నాయిలూ సేవి
నాహాయ్యాముసందు నన్ను గోర;
నాఁటని కిప్పు డచ్చె నాయింటి కాసారు
పింకె నాయనంగకీర్తిగాఁన?

మన జాతిలో కనకాంగివంటి స్త్రీరత్నలు పుట్టకుంటె ఆంధ్రవాఙ్మ్ర కిద్దట్టి పేరున్నదే?

ఆ. వె. తన జయమ్ము గాదు తన ప్రతాపము గాదు
కాదు ధనము హర్ష కారణమ్ము,
కన్నబిడ్డ జయమె కారణం బగుఁ జూడ
భాగ్య మదియె జన్మఫలము నదియె.

చతురిక—ఔనమ్మా, నీయదృష్టము మంచిది. కనకాంగిని చూచి "ఆహా పాప యదృష్టము" అని యబ్బురంపడని స్త్రీ మన జాతిలో లేదుగదా?

పాప—ఇంకా ఇప్పుడేమున్నదే? కేశవరావు కనకాంగిచేతి కీలుబొమ్మ కావాలి. సుబ్బిసెట్టి కుమారుని మనస్సు కనకాంగిమీఁదికి మఱలాలి. ఎల్లయూటకచేరీలయందు కనకాంగిపేరు మాఱుమ్రోగిపోవాలి. ఒనే, అప్పుడుగదా నేను బ్రహ్మానంద మనుభవించుట? అప్పుడుకదా పాప యదృష్టము "ఔరా" యని కొనియాడఁబడుట?

కనకాంగి—(స్వగతము) నేనంత అదృష్టవంతురాలనా? (అనిగర్వపడును)

(అప్పుడు నారాయణశాస్త్రి ప్రవేశించును)

పాప—దండాలు శాస్త్రిలుగారికి. జ్ఞాపక మున్నదా?

కనకాంగి—సాహిత్యచక్రవర్తికి వందనములు. (నమస్కరించును)

నారాయణశాస్త్రి—(మందహాసముతో) కోరుకొన్న ఫలము నెఱవే

అయినగాక. (స్వగతము) నాశక్తి యొక్క కనకాంగికిమాత్రమే తెలియును. ఆట్టి రసికురాలు మెచ్చిన సాహిత్యచక్రవర్తిని నేను. నాయెదుట తక్కిన సాహిత్యగాండ్రందఱు పంచలేగదా? ఏది? ఒక్క సారస్యము తీయుమను మాత్రము? ఒక్క కల్పన యెత్తుమను. వాక్యములోమాత్రము? ఏదీ? ఎంత నియోగియైన సరే నావలె నొక్క కార్యమును సంఘటింపు మను మాత్రము. అప్పే. నారాయణశాస్త్రి సామాన్యుఁడా? గంగని కుమ్మెగదా?

పాప— (స్వగతము) కనకాంగి సాహిత్యచక్రవర్తి అనుటతోడనే అయ్యగారి పురి యెక్కినది. కనకాంగినిమాఁచిన ఎప్పుడూ ఇష్టే యుండుగాక. (ప్రకాశముగా) శాస్త్రులుగారూ, కేశవరావేమో మోసగానివలె కానిపిస్తున్నాఁడు. మమ్మెక్కడకు పంపుటలో ఆతని యభిప్రాయ మేమో బోధపడుట లేదు.

నారాయణ—ఏమయిన నేమి? ఇప్పుడు మీకేమి నష్టము వచ్చినది?

పాప—నష్టము గాకేమి? రెండు నెలలనుండి యీవ్యవహారము జరుగుచున్నది. నేఁటి కింకను కాయో పండో తేల దయ్యెను. అయినవారి నందఱిని త్రోసివేయించెను. స్త్రీల ప్రాయము శిలాక్షరముగా నుండిపోవు ననుకొనుచున్నారా?

నారాయణ—ఈనష్ట మంతయు నొక్క క్షణములో కూడివచ్చునదియే.

పాప—మఱి సుఖము? గతించిన దినాలు తిరిగిరావుగదా?

నారాయణ—ఎప్పు డెప్పు డనిపించుకొని సుఖము సుఖమా?

పాప—మీతత్త్వవిచారము కట్టిపెట్టండి. మఱి నాయానందము?

ఆ. వె. ఎపుడు విభుఁడు గూడు నెప్పుడు సుఖపెట్టు
సాటివార లెపుడు సన్నుతింత్రు
నానినుంగు? ననుచు నేనుంటి నాశతో
నొక్క నిమిష మొక్క యుగము గాఁగ.

శాస్త్రిలుగారూ, నాయాందోళనము మీ కేమి తెలియును? పడుమ దినములో నున్నారు; గావున మించిపోయిన దేమనుకొంటారు. నాకట్లు కాదుగదా? అంతయయినైనది. పరలోకమునకు నాయాయుర్దాయమును లెక్కించుచున్నారు. కడుపునఁ బుట్టిన యీయొక్క బిడ్డ సుఖపడుట నాకు భాగ్య మున్నదో లేదో?

నారాయణ—పాపా, ఇట్టి మాటలాడెద వేల? నీకేమి లోపము?

పాప—ఇంక ఏమి లోప మని నిరపాధిగా నడుగుచున్నారా? రజస్వలయైన పిల్లను రెండేండ్లయినను కన్నెతనము ఏల కాలే దని సానులలో బంధువులందరు గుసగుసలు విని యెట్లు సహించియుండగలను?

నారాయణ—ఇంక గతజల సేతుబంధన మేల? మీ కిక్కడ ఖర్చుల నిమిత్తము అతడు రెండువందల రూపాయ లిచ్చియే యున్నాడుగదా? అతడు మోసగాడని యెట్లు చెప్పెదవు?

పాప—ఇట్టి నగరములో క్రొత్తవారికి రెండు వందలంటే ఎంత?

చతురిక—బండికే దినానికి నాలుగు రూపాయ లవుతున్నాయి, మొన్న పాపకు శూలనొప్పి రాఁగా వైద్యుఁడు పాతికరూపాయలు పుచ్చుకొన్నాఁడు.

నారాయణ—నేఁడాతఁడు రానే వచ్చెను.

పాప—ఇన్నిదినము లేల జాగయ్యెను?

నారాయణ—తండ్రిచాటువాఁడు. పైగా భార్యను వదలించుకొనుట యెంత కష్టము?

పాప—ఇంతకూ రొక్క మేమాత్రము తెచ్చినారు?

నారాయణ—మూఁడువేలు

పాప—అంతేనా?

నారాయణ—అక్కడకే చాలకష్టమైనది.

పాప—అంతా రొక్కమేనా?

నారాయణ—అవును. ఖర్చునిమిత్తము పైగా అయిదు వందలని యొక బాపతుగా దాచినారు.

చతురిక—నగలు లేవేదా?

నారాయణ—ఎక్కడినుండి వచ్చును?

చతురిక—ప్రాచీన తంగేడుచెట్టు ఇంట్లో వుండగా లోప మేమి? చేతికి అడ్డు కలదో!

నారాయణ—చెప్పుతెప్పు. ఆపని యిప్పుడే కాఁగూడదు. అల్లరి అగును. ఎప్పటికైనా అవన్నీ కనకాంగివే.

(కనకాంగి దేవగాంధి కన్నులు తేలవేయును)

కనకాంగి—(సిగ్గుతో) నాభారమంతా మీదే.

నారాయణ—(స్వగతము) ఆహా, ఇట్టి రమణీమణి వశమున నుండుట నాయదృష్టముగదా? (గర్వముతో తలయూఁచి) బళా, పాండిత్యమునకు తగిన రసికత. రసికతకుఁ దగిన యనుభవము. ఇంకేమి కావలెను?

పాప—కనుట, పెంచుటమాత్రమే నావంతు. ఇఁక కనకాంగిని బాగు చేయవలసినారు మీరే.

నారాయణ—హాహా, ఆమాటలు నీవు పదిసారులు అనవద్దు. చూడు కనకాంగికీ, నాకూ భేదమేమి? అయితే. ఒకటి చెప్పవలసియున్నది. కన్నెరికపు కట్నము నగలకొఱకు వెచ్చింపవలదు. నగలదారి నగలదే. నేనున్నానుగదా? ఇఁక కనకాంగి యొడలికి బంగారముతో మలాము.

పాప—ఇక్కడ నుండుట యెన్ని దినములు?

నారాయణ—నెలదినములకంటె నాతఁ డిక్కడ నుండఁడు.

(అప్పుడు కేశవరావు ప్రవేశించును. కనకాంగి మందహాసము గావించి సిగ్గుతో తల్లివెనుకకుఁ బోవును. చతురిక వినయము చూపును. శాస్త్రి మందహాసము చేయును)

పాప—దండాలు. నేఁటికా దయగలిగెనా?

కేశవ—(తలయూఁపి నమస్కార మందుకొని) నేఁటికి సెలవిమ్మనా.

నారాయణ—ఇఁక నిక్కడ నుండుట యెందులకు? బయలు పోఁగూడదా?

పాప—పెళ్లి చేయవచ్చును. ముహూర్తము రేపేనా?

నారాయణ—సందేహ మేమి?

కేశవ—శాస్త్రులుగారూ, నేఁడేల కాఁగూడదు.

నారాయణ—ఇంకను సన్నాహములు ఏమియు కా[illegible]దుగదా!

పాప—మీకు తెలియని వేడుక లేమియున్నవి? అవేగాక. శాస్త్రులుగారూ, నేఁడు నవమిగాదా?

నారాయణ—అవును. పాప చెప్పినది బాగున్నది.

పాప—శాస్త్రులుగారూ, తమకు సందేహము వలదు. పంతులుగారికి కోపము ఉండఁగూడదు. అడిగినదే పదిమాఱులు అడుగుట, చెప్పినదే పదిమాఱులు చెప్పుట, నాకు అభ్యాసము. నేను చెప్పిన విషయము జ్ఞాపకమున్నదా?

నారాయణ—దానికేమిలే? పన్నైదు వందలని నేను చెప్పలేదా?

పాప—ఇదేనా మీజ్ఞాపకము? (ముగము చిట్లించుకొనుచు) రెండువేలకు తక్కువ కల్లగాదని నేను నాఁడే చెప్పలేదా?

నారాయణ—(కేశవరావుదెసకుఁ జూచి యూరకుండును)

కేశవ—శాస్త్రులుగారూ, ఇప్పుడిది యేమి?

నారాయణ—తమరు సెలవిచ్చిన సంగతిని గుఱించి నేను చాలదూరము చెప్పినాను. అప్పటినుండీ పాప యిట్లే చెప్పుచున్నది.

కేశవ—(చుఱచుఱఁ జూచుచు) పాపా, నావలన ఇఁక నేమియుముట్టదని తలఁచితివా?

పాప—తమరు, అట్లెప్పుడూ సెలవీయఁగూడదు. మీభాగ్యము అతులము కావాలి. మీయింట బంగారు వాన కురియాలి. ఇది ఆనందసమయము.

ఇప్పుడు తమబోటి పనికులు స్వల్పవిషయములో పట్టుబట్టుట ధర్మము గాదు.

కేశవ—నేటితో తీఱిపోయెనా?

పాప—అట్లేల యగును? మా కనకాంగి మీకొఱకు పుట్టింది. మీకొఱకే పెరిగింది. అది యిక మీసొత్తే. ఇంతకూ మేము మీయన్నము తినవలసినవాళ్లము.

కేశవ—(స్వగతము) ఇక లాభము లేదు. (అంగీకారమును సూచించును)

నారాయణ—(స్వగతము) కనకాంగిని చూచుటతోడనే మనస్సుబిగి సడలినది. (ప్రకాశము) పాపా, పంతులుగారు ఉదారహృదయులు. వారి చేతి కెముక లేదు. దానకర్ణులు. విగపదేవేంద్రులు. నీవు కోరినట్లే యగును. రేపు ముహూర్తము నిశ్చయము. రేపు అంగడికిం బోయెదము.

పాప—తమకు తెలియని వేడుకలు లేవుగదా? (చేతులు జోడించి) దాసురాలు తమయాజ్ఞకు బద్ధురాలు.

కేశవ—ఇంక పోదమా శాస్త్రులుగారూ, (కనకాంగినిం జూచి బయలుదేఱును)

నారాయణ—చిత్తము.

(ఇరువురును వెడలిపోవుదురు)

పాప—(ముందునకు రెండడుగులు వేసి) అయితే శాస్త్రులుగారూ, మనవి.

నారాయణ—(వెనుకకు వచ్చును)

పాప—తమ బస యెక్కడ? (జనాంతికము) కనకాంగికి చెవిప్రాకెట్టుమీఁద ఉబలాటముగా నున్నది.

నారాయణ—(జనాంతికము) అందెంతసేపు? (ప్రకాశము) తిరుపతిశెట్టి పెద్దవీధిలో. మీరున్నదివాండెవండు! నారాయణ మొదలియారా? సెట్టి

యా? ఎవని వీధి?

పాప—నారాయణ మొదలివీధి. తిరువల్లికేణి గాదు. జార్జిటవును.

చతురిక—ఔదా మొదలూ లేని వీధులు ఈనగరములో చాలా గలవు. ఇది మొదలు మొదటికి మొదటి వీధి పేరు చెప్పుకోండి

నారాయణ—వా, జాతిలక్షణము నిలిపినావు. ఇష్టే నూతెలంగ్లాషడిల్లు (పాపతో) రేపుసాయంత్రము ఆఱుగంటలకు సిద్ధము.

(వెడలిపోవును.)

పాప—చతురికా, బండి త్రిప్పమను.

చతురిక—సరే. (వెడలిపోవును)

పాప—రావే తల్లీ, రా. పెన్నిధిని నీవశము చేస్తున్నాను. ఏమి చేస్తావో తెలియదు. మన కిచ్చు రెండు వేలూ గాక కేశవరావుదగ్గ పదునైదువంద లుంటాయి. చీరల కనియో, రైకల కనియో, పావడల కనియో, వాటిలో వేయినైన లాగవలయును. మొగమోటము వలదు. మొగమోటమునకును మోక్షమునకును దూరము.

తెరదించవలెను.

---

## ద్వితీయాంకము—ద్వితీయరంగము



(బసలో పడకటింట కేశవరావు ప్రవేశించును)

కేశవరావు—(స్వగతము) ఎంతపని జరిగినది! నావంశ మెక్కడ? భోగముదానికి కన్నెరికము సేయుట యెక్కడ? నాలుగుదినములనుండియు ఈ విషయము నాహృదయమునకు తోచుచునే యున్నది. నారాయణశాస్త్రి స్నేహము లేకున్నచో ఇది జరిగియుండకపోవునేమో? పరస్త్రీలను కన్నెత్తి చూడనివాడు కన్నెరికము సేయుట ఎంతైన వింతయో. (నవ్వుకొని)

పాపను లక్ష్మి నేను చెప్పినదే నమ్మి నాకొఱకు ఎదురు చూచుచుండును. గాని ఆమె యెంత అమాయకురాలు? నేననిన ఎంత భక్తి! ఎంత ప్రేమ?— అయితే నేనిపుడు క్రొత్తగా చేపట్టిన కనకాంగిగూడ ఆట్టిదే. కన్యాటీకము సేయుట నావంశమర్యాదకు తగనిదైనా కనకాంగివంటిపిల్లమాత్రము దొరకదు. (శిరఃకంపము గావించి) అయిన దేమో అయిపోయినది. ఇంక నిప్పుడు ప్రాంతి సంగతి యెందులకు?

(అప్పుడు నారాయణశాస్త్రి ప్రవేశించును)

నారాయణ—రావచ్చునా పంతులుగారూ, పెద్ద తగవు వచ్చిపడినదే.

కేశవ— ఏమిటదీ?

నారాయణ—కేళ్లంతా చూచుచుండగా మీరు నాకు నూటపదార్లు ఇచ్చుట మంచిపని కాలేదు. జామాతుమాత్రము ఇచ్చి అప్పటికి ఊరకుండ వలసినది.

కేశవ— మీనూటపదార్లకోసము ఇప్పుడు తగవు పెట్టుచున్నవా రెవరు?

నారాయణ—తగవన్న తగవా? పాపగోల పట్టజాలకుండ యున్నది.

కేశవ—పాప దానిలో వాటా పెట్టుమనునా యేమి

నారాయణ—దాని మొగము దానిలో వాటా యేమిటి? కాక అడిగితే మాత్రము నేను పెట్టెదనా?

కేశవ—ఇంక నేమి? తనకుగూడ నూటపదార్లు కావాలంటుందా యేమిటి?

నారాయణ—తమకు బోధపడని దేమున్నది? అదే సంగతి. లేకలేక కలిగిన పిల్ల. అదేనా ఒక్కపిల్ల. ఎప్పుడెప్పు డని కన్నులు కాయునట్లు వేచి యుండగా నేటికి కన్యాటీకపు మహోత్సవము. ఒక్క నూలుచీరగుడ్డ ముసలిదాని మొగముమీద కొట్టినా రంటుంది.

కేశవ—సివాళిపల్లెములో ఏబది రూపాయలు ఉంచితిమే.

నారాయణ—ఆ. నేనదే అన్నాను. అంటే అదేమన్నమాట? ఒకటి ఉంచినా, నాలుగు ఉంచినా, నాటుపద్దాలు ఉంచినా, నివాళిపళ్లెము నివాళిపళ్లెమే. మరి నాకు బహుమానమే యేమవుతుంది.

కేశవ—బాగానేయున్నది.

నారాయణ—ఏమున్న బాగు? అంతా బాగానే యున్నారు. మధ్య ఊపిరాడక నామీద పడింది.

కేశవ—ఏమంటుంది?

నారాయణ—ఏమనటానికేమున్నది? ఎన్నిసారులు లెక్క వేసినా ఆదే. అయ్యగారు మున్నూరురూపాయలు జామరు, నాటుపద్దాలు ఇన్నాళ్ళుగా ఉండి, ఎప్పుడు లేకుండా పుచ్చుకొని మీరు నిమ్మళంగా నీరుపోసినట్లు ఊరకున్నారు. నాకు ముప్పదిరూపాయలు నాలుగేరమాత్రమే యిచ్చి యూరకుండగా మీరుకూడా ఊరకున్నారు అంటుంది.

కేశవ—మరి నేమి చేయవలసినదని దాని భావము?

నారాయణ—నేను తమకు చెప్పి తన కేమీ ఇప్పించలేదని. ఇంకో సంగతి. మహారాజులాగ ఆయన—అంటే తమరు—ఉండగా పాదసేవకు దాసురాండ్రము మేము ఉండగా మధ్య మీరెవరు? మీరు చేసిన నిర్వాహకత్వమేమున్నది? మీరు లేకపోతే మాత్రము మాకీవ్యవహారము కుదరదా? మేమే పోయి ఆ మహారాజుకాళ్లమీద పడి ప్రార్థించుకోలేమా? అంటుంది. ఇన్నాక పోయినా తమరు మహారాజులే. మీరన్నా, వాళ్లన్నా, మధ్య నన్నేకదా?

కేశవ—అదేమిటి? నిన్ను నే నేమన్నాను?

నారాయణ—అబ్బే, అన్నారని కాదు బాబయ్యా, అనినా అనకపోయినా రాయబారుల స్థితి అట్టిదని వివరము నిమిత్తము మనవిచేసికొన్నాను.

కేశవ—సరే ఇప్పుడు చేయవలసిన దేమో చెప్పండి.

నారాయణ—ఏమున్నది? ఇంతకూ కనకాంగి యేమయినా తమతో

యీసంగతి చెప్పినదా?

కేశవ—(నవ్వి) అమాయకురాలు. దాని కేమి తెలియును?

నారాయణ—(స్వగతము) ఇప్పుడమాయకురాలే. (ప్రకాశము) అయినా కదలించి చూడండి.

కేశవ—సరే.

నారాయణ—చిత్తము. అయితే బాబయ్యా, ఒక్క మనవి. పాపము చదువక పట్టె అమాయకురాలు. అది మీకు చేసే చాకిరీకి లెక్కలేదు. దానికి మాత్రము మరి పది రూపాయలు అదనముగా యిచ్చి సంతోషపెట్టవలెను.

కేశవ—ఆలాగే చేయుదము.

నారాయణ—అయితే యీసంగతి మాత్రము ముళ్లముప్పి ఉన్నదే పాప? దానికి తెలియనీయకూడదు.

కేశవ—అవును—అట్లే

నేపథ్యమున

చతురికా, పంచదార చాలదంటే అంతసేపటే?

నారాయణ—తమకు ఫలహారము, కాఫీ, పట్టుకొని కనకాంగి వచ్చుచున్నది. మరి నాకు సెలవు.

(నారాయణశాస్త్రి వెడలిపోవును)

నేపథ్యమున

ఎంతసేపూ, మగనికి ఫలహారమూ, తనకు ఉపాహారమూను. కన్నతల్లి ముండసంగతి చూడనక్కఱలేదు. నానాపాట్లు పడి పెంచినందుకు ఇట్లు కావలసినదే.

(అప్పుడు పళ్లెములో ఉప్మా, పండ్లు మున్నగునవి ఉంచుకొని చెంబుతో కాఫీ పట్టుకొని కనకాంగి ప్రవేశించుచున్నది)

కనకాంగి—(రుసరుసలాడుచు) అబ్బా, ఎముకలు కొరుకుకొని తినుచున్నది యీముండ. ఎంతసేపూ ఒకటే గోల. (అని తెచ్చినవానిని బల్ల

మీఁద నుంచి పైటచెఱఁగు మొగమునకు కప్పుకొని పటాలున కేశవరావుప్రక్కలో కూర్చుండి తలుగ నతని భుజముమీఁద వానుకొని చేతులు మెడకు పెనవేసి) ఈనుసిముండతో నేను వేగలేను. మనము ఇంటికి పోదాము రండి.

కేశవ—(కనకాంగి ముఖమును ఎగటకు త్రిప్పుకొని ముంగురులు నిమురుచు) వెళ్లిదాము, మన యింటికిం బోయిన మీయమ్మమాత్రము రాదా?

కనకాంగి—(శిరము వంచుకొనియే యుండి) మఱెక్కడకైనా తీసికొనిపొండి నన్ను.

కేశవ—ఇప్పు డేమి వచ్చినది?

కనకాంగి—దానికి బహుమతీ కావాలట. నాకు రెండువేలు, శాస్త్రి గారికి నూటపదాఱు ఇచ్చేరట. నన్ను చూడలేదట. ఒక చీరమాత్రము మొగమున కొట్టినారట.

కేశ—నివాళిపళ్లెములో ఏఁబదిరూపాయలు వేయలేదా?

కనకాంగి—(ముఖము పైకెత్తుకొని) వాని దాసీవానిదేనట. అవి నివాళి యిచ్చినందుకు తప్పనట.

కేశవ—మఱి యిప్పు డేమి చేయవలయును?

కనకాంగి—ఏమీవద్దు. గప్ చిప్ గా ఊరకోండి.

(నేపథ్యమున)

౧ పాపమ్మపిన్నమ్మా, కాఫీపుచ్చుకోడానికిరా.

౨ కాఫీలాగే వున్నది నాబ్రతుకు. కాఫీ పుచ్చుకునే యోగముంటే నాకు చిన్నతన మెందుకు చేస్తారూ?

కనకాంగి—(ద్వారముదెసంజూచి) నీబ్రతుకునకు చిన్నతనము వచ్చినది ఎన్నేళ్లు వచ్చినా అదే మాట. (కేశవరావుతో) ముసలిముండకు ఒక్క దమ్మిడీ యివ్వవద్దు.

కేశవ—లేకపోతే నిన్నూ, నన్నూ ఇద్దే పీకుకొనితినుచుండును. స్వేచ్ఛగా నుందా మని యిక్కడకు రాఁగా యిక్కడఁగూడ దయ్యపుపోరైతే రెట్లు?

కనకాంగి—చేతిలో డబ్బు ఉన్నదో లేదో. క్రొత్తసంసారము. ఇంటికి వెళ్లేదాకా ఎంతో కొంత చేతిలో ఉండుట మంచిది. ఇంటికి వెళ్లి ఖర్చు ఏమవుతుందా? అమ్మో. ఎప్పుడొచ్చినా అప్పటిదే. వాడే యిస్తాడో, ఎవడే యిస్తాడో అని మూడుదినాలు చూచి దట్టించకేసి మాట్లాడేవారు లేకపోయేరట. నాలుగోనాడు తెల్లవారింది. అప్పుడే తాగావు. రాకాసిముండ కాఫీ అయినా పుచ్చుకోకుండా దీని మొగాన బహుమతీ గ్రహించాలంటుంది.

కేశవ—ఎప్పుడైనా తప్పనిదే. ఇదిగో తాళము. నూఱురూపాయల నోటుసకటీ, చిల్లర రూపాయలు పదాఱు తీసి యిచ్చిరా.

కనకాంగి—నాచేతితో నేనీయను ఆపాడుముండకి. మీరే ఇచ్చుకోండి. (అని కేశవరాయని చేతిని త్రోసివేయును)

కేశవ—అయితే వెళ్ళి తీసి నాచేతికి ఇమ్ము. ఇదిగో తాళము పుచ్చుకో.

కనకాంగి—(చేతిని మఱల త్రోసివేసి చుఱచుఱఁజూచుచు) కాఫీ పుచ్చుకొనీదాఁకానైనా ఉండఁగూడదా యేమిటి? ఊరుకోండి కసెంత సేపు తరువాత నన్నవతలకు పోనిచ్చి యిచ్చుకోండి మీఅత్తగారికి.

కేశవ—ఎప్పుడొచ్చినా మీ యమ్మ నాకు అత్తగారే.

కనకాంగి—(చిఱునగవుతో కేశవరావు బుగ్గమీఁద పొడిచి) ఏమిటా కొంటెమాటలు!

తెర దింపవలెను.

---



# తృతీయాంకము—ప్రథమరంగము



## కేశవరావు గృహము

---

(కచేరీసావడిలో కేశవరావు తండ్రి రామదాసు ఒక సిద్ధాంతి ప్రవేశింతురు. సిద్ధాంతి జాతకము చూచుచుండును)

రామదాసు—సిద్ధాంతిగారూ, రాజయోగముల కేమి లెండు. అవయోగము లేకున్న సుయోగ మున్నదే. మీరు నేనేమో గొప్ప ప్రయోజకుండ నంచు చెప్పుచున్నారు; గాని పిత్రార్జితము తక్క నేనేమియు నెఱుఁగను.

సిద్ధాంతి—పిత్రార్జితమును భద్రము చేయుట గొప్ప ప్రయోజకత్వము గాదా?

రామదాసు—అట్లయిన మీమాట యథార్థమే. నేను స్వంతముగ నొక్క కాసయిన సంపాదించి యెఱుఁగను. అట్లే పైతృకమగు వసతిని గవ్వంతయిన పాడుచేసి యెఱుఁగను. జపతపములతోడనే నాకు కాలము సరిపోవుచున్నది. ఇఁక లౌకికవ్యాపారములు సేయుటకు అవకాశ మెక్కడిది?

సిద్ధాంతి—మీది యోగజాతకము; గావున కష్టపడి యెఱుఁగరు. దేవేంద్రవైభవ మున్న మీదే. ఏదీ మన వైదికులలో మీయంత యదృష్టవంతుని జూపుఁడు.

రామదాసు—ఏమి యదృష్టమండీ! ఈజగత్తంతయు కేవలము మిథ్య. ఇది యథార్థ మనుకొని భోగము లనుభవించువాఁడు ఆముష్మికజ్ఞానము లేని కిరాతుఁడు. కేవలము ద్విపాత్పశువు.

సిద్ధాంతి—(స్వగతము) ఈతఁ డిట్టివాఁడు కావుననే అపారధన మార్జించుట కెన్నో అవకాశము లుండియును ముక్కుమూసికొని కూర్చున్నాఁడు. ఎట్టి [illegible] గలవాఁడు [illegible] బోధింతును. (ప్రకాశము) మీరు

చెప్పినది యథార్థము; గాని జగన్మిథ్యాత్వజ్ఞానము పురాకృతపుణ్యఫలమువలన గాని కలుఁగదు.

రామదాసు—ఆవిషయ మంతటితో కట్టిపెట్టుదము. నాకిపుడు కాం వలసినది వేఱు. అఱువది యేండ్లు గడచినవి. కళత్రవియోగము గలిగినది. కుఱ్ఱవాఁడు పెద్దవాఁడై నేఁడో రేపో సంసారభారమును వహింపనున్నాఁడు. ఇప్పుడైన నాకు సన్న్యాసయోగ మున్నదా లేదా?

సిద్ధాంతి—(జాతకము చూచి వ్రేళ్లు లెక్కించి ఆకసమువంకఁ జూచి) ఆసన్నమై యున్నది.

రామదాసు—అనఁగా?

సిద్ధాంతి—కొలఁదికాలమునందే మీకాయోగ మున్నది.

రామదాసు—సిద్ధాంతిగారూ, మీరు నిజమే చెప్పుచున్నారా?

ఆ. వె. ఎపుడు సన్న్యసింతు—నీఘోరసంసార
జలధిదాఁటి యెపుడు సౌఖ్యపడుదు?
నేఁడొ, రేపొ, దినము నిర్ణయింపఁగలేరొ
అవధియైనఁ దెలుపుఁ డంతె చాలు.

సిద్ధాంతి—(స్వగతము) ఈయనకు సన్న్యాసమువిూఁద నెంత కాంక్ష యున్నది! జాతకమున సన్న్యాసయోగము గలదు; గాని తుదకు భ్రష్టుఁ డగునట్లు తోఁచుచున్నది.

రామదాసు—ఆలోచింపుఁడు. తొందరవలదు. సందేహము వలదు. మొగమోటమి వలదు.

సిద్ధాంతి—(మఱల యోచించి) కాషాయవస్త్రములు ధరించియుండఁగా నెలలోపున మిమ్ము చూచెదము.

రామదాసు—(బ్రహ్మానందముతో) నిజమేనా? నెలలోపుననేనా? సిద్ధాంతిగారూ, మీమాటలే నిజమయినచో నింక నాకును మీకును నేఁటితో ఋణము తీఱిపోయినట్లే గదా? మిమ్ము సత్కరించుట యెట్లును తప్పదు.

మీమాట యథార్థమో దబ్బరయో పరీక్షింత మన్న—శతాలున సన్న్యాసి నైనపో నప్పు డేమి చేయుటకును లేదుగదా? కావున నిప్పుడే కానిండు (సందుకా పెట్టె తెరచి) పదిరూపాయలే యున్నవి. ఇవే స్వీకరింపుడు.

సిద్ధాంతి—(పుచ్చుకొని) మీవంటివారు నాప్రశ్నను పరీక్షించుటయే పదివేలు. అయినను బీదవాడను; గావున సత్కారము పొందవలసినది. (అని పుచ్చుకొనును) ఇక సెలవు.

రామదాసు—చిత్తము. తిరుగ దర్శన మీయవలెను.

సిద్ధాంతి—సెలవునకు బద్ధుడను.

(వెడలిపోవును)

రామదాసు—(స్వగతము) నెలలో సన్న్యాసయోగ మున్న దనియా యీయన చెప్పెను? ఇది యేమగునో! అబ్బా, సంసార మెంత నిస్సారము

వెంకన్న—(ప్రవేశించి) రెండు జాబులు వచ్చినవి. టపాబంట్రోతు నిన్ననే యిచ్చినాడు. (ఎదుట నుంచును)

రామదాసు—నేను రాత్రియే వచ్చియుండగా నప్పుడేల చూపలేదు?

వెంకన్న—మఱచితిని.

రామదాసు—సరేపో.

(వెంకన్న నిష్క్రమించును)

రామదాసు—(ఒకజాబు విప్పి చూచి) ఈన్యాయవాదుల కెప్పుడును సొమ్ము పంపు మనిరేగోల. (దానిక్రిందనుంచి రెండవజాబు విప్పి) ఏమిటి? "మీకుమారుని ప్రవర్తనమును గుఱించి సందేహించుటకు మీకు ఎప్పుడయిన హేతువులు కనబడినవా?" యని ప్రశ్న. దీని కర్థ మేమి? కేశవుని ప్రవర్తనమును గుఱించి యిప్పుడేమి గందరగోళమువచ్చినది? ఇంతకు ఈజాబువ్రాసిన యాతడెవడు? (కండ్లు చికిలించుకొనుచు జూచి) దిక్కుమాలిన సంతకము వలెనే యున్నది. మొదట చూచిన ఇగ్లీషు. సంతకము నిసింద్ వ్రాత (మఱలజూచి) సూర్య......మూర్తియా? కడిమి యక్షరములు అలుముకొని

పోయినవి. (బాగుగా జూచి) ఏడిచినట్లే యున్నది. నారాయణకు వచ్చిన పొట్లా యిది? న్యాయవాది గుమాస్తాగాఁడు వీఁడు. జాబు చూతము.

"నిన్న మధ్యాహ్నము బజారులో మీకుమారుఁడు కాన్పించినాఁడు. కూడ నొక తరుణి యున్నది. మొదట మీకోడలనుకొంటిని. వేషము కులస్త్రీల కుచితముగ లేదు. వారిరువురును ఒక యింగ్లీషుదుకాణమునకుఁ బోయిరి. నేను సందేహించి వారు వెడలిపోయిన తరువాత వాకబు చేయఁగా మూఁడు వందలరూపాయలకు పట్టుగుడ్డలు తీసినట్లు తెలిసినది. సొమ్ము ఆతఁడేయిచ్చెను. ఇల్లు ఆస్త్రీ కేగ నున్నది. దుగ్గిరాల కనకాంగి యట. ఆమె యెవతె? నేను భ్రాంతిపడినచో క్షమింపవలెను.

సూర్యనారాయణమూర్తి"

(జాబు క్రిందఁబడవేసి) ఏమిటి? దుగ్గిరాల కనకాంగియా? మూఁడువందల రూపాయలకు పట్టుగుడ్డలా? వేషము కులస్త్రీల కుచితముగ లేదా? ఈయూరున "దుగ్గిరాల" అను నింటిపేరుగల వారకాంతలు కలరు. కనకాంగి యెవతె? (ద్వారముదెసఁజూచి) ఎవఁడురా?

వెంకన్న—(ప్రవేశించి) ఏమి సెలవు బాబయ్యా?

రామదాసు—సూరయ్యను తీసికొనిరా.

వెంకన్న—ఏసూరయ్య బాబూ,

రామదాసు—హాస్యగాఁడురా. ఎఱుఁగవూ?

వెంకన్న—ఇప్పుడే ఈవీధిని వెళ్లుచున్నారు.

(అనిపోవును)

రామదాసు—(స్వగతము) మనస్సు కలఁతపోవుచున్నది. కేశవునిమతి చలించినదా?

(అప్పుడు సూరయ్య ప్రవేశించును

సూరయ్య—ఏమి బాబయ్యా, సెలవు?

రామదాసు—ఏమీ లేదయ్యా; మా బంధువుల యింట శుభకార్యమఁట

మేళము కావలె నంటు.

సూరయ్య—అభ్యంతర మేమిటి బాబూ? నీలాచలము మేళము ఉన్నది సుభద్రాచలము మేళము ఉన్నది. వీరభద్రము మేళముఉన్నది. వేంకటరత్నము మేళము ఉన్నది. మాణిక్యాము మేళము ఉన్నది. సూర్యకాంతము మేళము ఉన్నది. అమ్మాణ్ణి మేళము ఉన్నది. శ్రీనిరాజితము మేళగూడా ఇక్కడనే ఉన్నది. ఇంకా చిల్లర మేళాలు చాలా ఉన్నవి. ఏది చూడమన్నా తమ సెలవునకు అడ్డులేదు.

రామదాసు—మీరే మేళములో నున్నారు?

సూరయ్య—ఈయేడు విడిపోయినాను. కొందఱు సానులు కోరుచున్నారు. ఇంకా ఎక్కడా కుదరలేదండి.

రామదాసు—ఏమయ్యా, హాస్యములో పూర్ణవిద్వాంసుడవు. నీకే ఇట్లు రికామీగా నుండవలసివచ్చినదా?

సూరయ్య—ఏమి విద్వత్తు బాబయ్యా? తమవంటి ప్రభువులు సభలలో కూర్చుండుట మానివేసిన పిదప విద్వత్తుచూచేవారే లేరు. అందులోనూ వీరేశలింగముగారుబయలుదేరిన తరువాత ముఖ్యముగా నాన్‌కోఆపరేషను వచ్చిన పిదప విద్యలను చూచేవారే లేరు. పిల్లలు అందముగా ఉంటే చాలును. ముతక గుడ్డలు కట్టి గాంధి పాటలు పాడితే చాలు. ఈదెబ్బతో ఇప్పుడు అంతా నాయకురాళ్లే. అంతాహంగుదాళ్లే. మావంటివాళ్లకి ఇప్పుడు ఆదరములేదండి.

రామదాసు—సరే. ఇప్పుడదంతా యెందుకు? మీరు చెప్పిన మేళము లేమీ పనికిరావు. దుగ్గిరాల కనకాంగి యుంటు. దాని మేళము కావాలి.

సూరయ్య—చెప్పడము మఱచితిని. అది మంచిదే. తెలివయినదే. మఱల ఒక దశ వెలిగించ గలిగినదే; మనయింటికి వస్తూ పోతూ వుండే నారాయణ శాస్త్రులుగారు దానికి సంస్కృతము చెప్పినారు.

రామదాసు—(చకితుండగును)

సూరయ్య—దానికీ, నాకూ మాటలు లేవండి.

రామదాసు—(స్వగతము) కనకాంగిది యీయూరేనా? నారాయణ శాస్త్రి దానికి గురువా? శాస్త్రి గొంతుకు కోసికాఁడా? (ప్రకాశము) దాని మేళము కావలెను. మఱియెట్లు?

సూరయ్య—అయినా అది యిప్పుడు గ్రామములో లేదండి.

రామదాసు—(స్వగతము) గ్రామములో లేదూ? అన్నీ యీబాబునే ధృవపఱుచుచున్నవి. (ప్రకాశము) ఎక్కడ నున్నది?

సూరయ్య—చెన్నపట్టణము వెళ్లినట్లు తెలిసినది.

రామదాసు—(స్వగతము) చెన్నపట్టణమే వెళ్లినదా? ఇఁక సందేహమేల? హా, నాయనస్థ,

ఆ. వె. చెడెను సుతుని గుణము చెడెను ధనం బెల్ల
చెడెను గౌరవమ్ము చెడెను కొంప.
గణిక కోడలయ్యె తనయుండు విటుఁ డయ్యె
కాలఁబడితి నరకకూప మందు.

ఇంతకంటె మరణము మేలుగదా?

సూరయ్య—ఏమి సెలవు బాబయ్యా?

రామదాసు—కనకాంగి చెన్నపట్టణము వెళ్లి యెన్ని దినము లయినది? ఏల వెళ్లినది?

సూరయ్య—వెళ్లి నెలనాళ్లైనది.

రామదాసు—(చకితుఁ డగును)

సూరయ్య—ఏదో జబ్బు చేయఁగా బాగుచేయించుకొనుటకు వెళ్లినట్లు తెలిసినది బాబయ్యా.

రామదాసు—(స్వగతము) సరే. కేశవుఁడు వెళ్లిగూడ నెల యైనది. జబ్బుచేసినదా? బాగుచేయించుకొనుటకా? (ఉద్వేగముతో) కాదు. కన్నెతికము చేయించుకొనుటకు.

సూరయ్య—ఏమి సెలవు బాబయ్యా?

రామదాసు — సరే వెళ్ళండి. ఈ సంగతి నాకు వ్రాసి జవాబు తెప్పించెదను.

నాగయ్య — చిత్తము. తరువాత నాకే వర్తమానము చేయించవలెను. ఏదో యొక మంచి మేళము రాయితీగా కుదుర్చెదను.

(వెడలిపోవును)

రామదాసు — (స్వగతము) ఆహా, దైవమాయ

ఆ. వె. తలఁచుకొనిన ఫలము తప్పించుకొనిపోవుఁ
దలచుకొని వెళ్ళఁ దారసిల్లు;
వాన కురియు ననిన పడగండ్లు పడు; పిల్ల
పిడుగ పడును, వీఁచు పెద్దగాలి.

నాకొడుకు మంచివాఁడని నలుగురిలోను పొగడితిని. ఇప్పుడు పదుగురు నాకొడుకును నాయెదుటనే తెగడుదురు. ఇంతకంటె శృంగభంగ మేమున్నది? పన్నీటి జల్లున కాంక్షింపఁగా క్రాఁగిన యాముదపువాన కురిసినది. మంచిగంధపుకట్టై యనుకొనఁగా మిన్నాగై నెత్తిమీఁద పొడిచినది. దీపము అంధకారమును తొలఁగించు ననుకొనఁగా కొంప బూడిద చేసినది. హా, తల తిరిగిపోవుచున్నది. (పైకిచూచి) నారాయణశాస్త్రీ, నాసంసారమును నట్టేటఁ గలిపితివిగదా? (ఉద్వేగముతో) వేదవాఁడట. పండితుఁడట. ఆశ్రితుఁడట. తలఁచుకొనిన ఒడలు మండిపోవుచున్నది.

గీ. మేకయై వచ్చి పులి యయి మీఁదఁ బడియె,
కుక్కయై వచ్చి సింగమై కొంపముంచె,
శాస్త్రియై వచ్చి శస్త్రమై చక్కడంచె
ఆశ్రితుఁడ నంచు కాలాగ్నియై దహించె.

ఇరువదిరూపాయలు బహుమానము గొనిన శాస్త్రియా వీఁడు? మంచి యాశీర్వచనమే చేసినాఁడు. ఫలము ప్రత్యక్షముగ ——ఇహమునందే—వెంటనే కలిగినది. ఆహా! తిన్నయింటి వాసాలు లెక్కించుట! ఎక్కడి విశ్వాసము? ఎక్కడి న్యాయ్యము? అనృతమయ మయిన విద్యయందు

ఐశ్వర్యముగూడ సమానముగ నున్నదిగదా?—ఛీ, ఈప్రపంచముగతియే యిట్టిది. (యోచించి) కాని కేశవునకు ధన మెట్లు వచ్చినది?——పిల్లనమ్మఁడానునకు ధనమున కేమి లోపము? కలదుగదా తెలిదుండ్రుల నాటకపాటకి అప్పిచ్చి కొంపలుతీయు ధనికులు? (మరల యోచించి) ఇట్టి నీచమైన దొంగతనము జరిగియుండునా? సందేహ మేల? కలదుగదా నోరులుఁగని ముద్దరాలు, నగలతో నిండి పూచిన తంగేడువంటి లక్ష్మి, నాగారాబుకోడలు? కేశవుఁడు వెళ్లిన నాఁటనుండియు, ఆమె యొడలిమీఁద నగ లుండుట చూడలేను. ఆమె పతి యూరున లేకుండుటచే నగలను ధరించుట లేదా? దొంగిలింపఁబడుటచే ధరించుట లేదా? అరయవలెను. (అని లేచి పరిక్రమించి) ఆమె యిప్పు డేమి చేయుచుండునో? (ఒక్క అడుగు వెనుకకు వేసి) అయినను సంకోచించుట కిది సమయము గాదు. (అని మేడమెట్లెక్కి నభివసించి చూచి) అంతఃపురము నిశ్శబ్దముగా నున్నది. పిలిచెదను. (ముందుకు చూచి) పార్వతీ,

నేపథ్యమున

బాబయ్యా, వచ్చుచున్నాను.

(తలుపు తెఱచుకొని పార్వతి ప్రవేశించును. మంచముమీఁదకూర్చుండి లక్ష్మి కాన్పించును)

రామదాసు—నేను లక్ష్మినిఁ జూడవలెను.

లక్ష్మి—(స్వగతము) ఇప్పుడిది యేమి?

పార్వతి—దయచేయవచ్చును. (లోనికిఁ బోయి) మామగారు వచ్చినారు. లే తల్లీ!

రామదాసు—(ద్వారము చెంతకు వచ్చి) అమ్మా, లక్ష్మి.

లక్ష్మి—(సిగ్గుతో) ఎందుకు మామయ్యా?

(మంచము దిగును)

రామదాసు—ఏమియు లేదమ్మా, నీనగ లన్నియు నొక్కమాఱు చూడవలెను.

లక్ష్మి—(స్వగతము) ఇప్పుడు నగలపని యేమివచ్చినది? (ప్రకాశము) మామయ్యా, తెచ్చుచున్నాను. (అని పెట్టె తెఱచి ఎదుట నుంచి జనాంతికముగ పార్వతితో) ఎందులకో నీవు ఎఱుంగుదు వటే?

పార్వతి—ఏమో నమ్మా,

(లక్ష్మి పార్వతి మాట రామదాసువినె నేమో యని చకితయై ఔను గఱచి జంకెనచూపులతో పార్వతి నదలించి నోరుమూసి వడలును)

రామదాసు—ఏమియును లేదమ్మా, నిన్నరాత్రి యీనగలు అన్నియును దొంగలు దోచుకొనిపోయినట్లు స్వప్నమయినది. నా మనస్సును నేమ నమ్మలేక చూచితిని.

పార్వతి—(సిగ్గును, ఆనందమును అభినయించుచు) బాబయ్యా, ఒక సంతోషవార్త.

(లక్ష్మి అదియేమో అని చెవులొగ్గివినును)

రామదాసు—అదియేమో చెప్పుము.

పార్వతి—ఇంక ఆఱుమాసాల్లో మీరు పనుమని రెుత్తుకొంటారు.

లక్ష్మి—(జనాంతికము) ఓసీ, ప్రేలరీ, ఇదంటే? (అని పార్వతిబుగ్గల మీఁదపొడిచి దూరమున శిరమువంచుకొని నిలుచును)

రామదాసు—(స్వగతము) అగ్నికుండములో చందనచర్చ. ఈశ్వరా, నీనిర్ణయ మవాఙ్మనసగోచరముగదా?

చ. బ్రతుకు ఘటించు నోషధి కరాళవిషమ్మున, ఉక్కుతీగలం
దతిమృదునాదమున్, దహనునందు ప్రకాశము, నుప్పునీటిలో
రతనము, లాణిముత్తెములు, రాళ్లను కప్పకు జీవనంబులున్
జతురతఁగూర్తు వెయ్యది యసాధ్యము? నీకిఁక లోకబాంధవా!

పార్వతి—(లక్ష్మిచెంతకుఁ బోవును)

లక్ష్మి—(పార్వతి బుగ్గలు నులిమి జనాంతికము) ఆమాట యెవ్వరెందులకుఁ జెప్పితివే?

పార్వతి—(జనాంతికము) తప్పేమమ్మా?

రామదాసు—(స్వగతము) ఇఁక నేమి చేయుదును? హా, యిఁక నిక్కడ నుండలేను. (అని మెట్లు దిగుట నభినయించును)

లక్ష్మి—(జనాంతికముగ) నేఁడు మామయ్యవాలక మెట్లో యున్నది చాటున నుండి కనిపెట్టిరావే. (అని పార్వతిని ముందునకు గెంటును)

పార్వతి—సరే. (అని బయలు దేఱును.)

రామదాసు—(తిగివచ్చి) కేశవునకు సొమ్ము ఎట్లు వచ్చినది? ఎవరిచ్చిరో తెలిసికొనవలెను. (అని వీధిదెసకుఁ జూచి) అడిగో టపాబంట్రోతు. వానివలన కొన్ని విషయములు తెలిసికోవచ్చును. వెంకన్నా, (అని పిలుచును)

వెంకన్న—(ప్రవేశించి) ఏమి బాబయ్యా?

రామదాసు—వీధిలో టపాబంట్రోతు అట్లు పోవుచున్నాఁడు. తీసికొనిరా.

(వెంకన్న వెడలిపోవును)

(రామదాసు సందుకావద్ద కూర్చుండును. వెంకన్న టపాబంట్రోతుతో ప్రవేశించును. అప్పుడు పార్వతివచ్చి తలుపుచాటునపొంచియుండును)

టపాబంట్రోతు—ఏమి సెలవు బాబయ్యా, (అని చేతులు జోడించి నుదుటి కానించుకొని నిలుచును)

రామదాసు—విశేషములు ఏమియు లేవురా. అయితే మా కేశవరావు దస్తూరీ నీవు ఎఱుఁగుదువుగాదూ?

టపాబంట్రోతు—అయ్యో, బాబయ్యా, అంతమాత్రమే తెలియదా?

రామదాసు—ఆతనిపేర ఇక్కడ నుండి ఏమయిన జాబులు పోవుట గాని ఆతనివద్దనుండి యిక్కడకు—నాకుఁగాక—మఱియెవ్వరికైన జాబులు వచ్చుట గాని జరుగుచున్నదా?

టపాబంట్రోతు—లేకేమి దొరగారూ, వారముదినాలక్రిందట నాచేతులతో నేను చిన్నదొరగారి సంతకముతో వచ్చిన రెండు జాబులు ఇచ్చేను

సుబ్బిసెట్టిగారికి. మతి—(అర్థోక్తి)

రామదాసు—(సకితుఁడై) సుబ్బిసెట్టికా?

టపాబంట్రోతు—చిత్తము బాబయ్యా,

రామదాసు—(స్వగతము) సుబ్బిసెట్టికూడ ఈకుట్రలోఁ జేరియున్నాడా? (ప్రకాశము) ఇంక నేమిరా?

టపాబంట్రోతు—నాలుగురోజులనాఁడు సుబ్బిసెట్టిగారు మాకచేరీలో చిన్నదొరగారిపేర నాలుగువందల రూపాయలు కట్టినారండి.

రామదాసు—నాల్గువందలేనా?

టపాబంట్రోతు—ఔనండి.

రామదాసు—సరే పో.

(టపాబంట్రోతు వెడలిపోవును)

పార్వతి—(స్వగతము) సుబ్బిసెట్టి చిన్నదొరకు రూపాయ లెందుకు పంపినాఁడు?

రామదాసు—(స్వగతము) ఇక్కడ కంతయు తేలిపోయినది. కేశవునకు దుర్బుద్ధి పుట్టించినవాఁడు శాస్త్రి. అగ్గిగుండములోనికి నెట్టినవాఁడు సెట్టి; గాని కన్నెటిమునకు నాల్గువందలేమి చాలును? చిన్నపట్టణములో రసికునకు నాల్గువందలు నెలకైనను జాలవే. ఈనాల్గువందలయినను నాల్గుదినముల క్రిందట వెళ్లినవే. వెంట కొంత సొమ్ము తీసికొనిపోయియే యుండును.

(అప్పుడు సుబ్బయ్య ప్రవేశించును)

రామదాసు—(స్వగతము) ఇడిగో శాస్త్రి తమ్ముఁడు సుబ్బయ్య. వీనిని నిర్బంధించినచో ఇక్కడి సంగతు లన్నీ తెలియును.

సుబ్బయ్య—(స్వగతము) నిన్న వ్యాపారము తండ్రికిఁ దెలిసినదియు లేనిదియుఁ గనుగొని ప్రతిదినము తనకు జాబు వ్రాయుచుండవలసిన దని కేశవరావు చెప్పెను; గాని నేఁటివఱకును నాకు తీఱికయే లేకపోయినది.

రామదాసు—రావోయి సుబ్బయ్యా, రా. కూర్చో.

సుబ్బయ్య—నేను ఈనడుమ నెలదినములనుండి సరిగ గ్రామములోనుండుటలేదు. క్షేమమా?

రామదాసు—ఆ మీదయవలన క్షేమమే. (ద్వారముచెంత జూచి) వెంకన్నా,

వెంకన్న—(ప్రవేశించి) ఏమి సెలవు బాబయ్యా?

రామదాసు—తలుపులు బిగించి నామువ్వెలు తీసికొనిరారా.

(సుబ్బయ్య వెలవెలబోవును. వెంకన్న వీధితలుపులువేసి ముచ్చెలు తెచ్చి అక్కడనుంచి తాను నిలిచియుండును)

రామదాసు—(ఎడమచేత సుబ్బయ్య జుట్టుపట్టుకొని కుడిచేతముచ్చె యొకటి పట్టుకొని) చెప్పుము. నీవును నీయన్నగారును గలసి కేశవుని విషయమున చేసిన కుట్ర అంతయుం జెప్పుము. (అని చెంపమీద కొట్టును)

సుబ్బయ్య—(వడఁకుచు) నన్నెందుకు కొడతారు? నన్నెందుకుకొడతారు? బాబోయి, బాబోయి, రామదాసుగారు నన్నుచంపేస్తున్నారు.

(బొబ్బలు పెట్టును)

రామదాసు—(చెంపమీఁద కొట్టి) నోరు మూసికో. ప్రేలకు. జరిగినదంతా చెప్పు.

వెంకన్న—అట్టే తెగనీలకు చేసిన దొంగతన మేంటో చెప్పవయ్యా యెముక లిరగదన్నేను. (తన్నబోవును)

సుబ్బయ్య—ఓరిబోడీ, నీవు నన్ను తన్నేద వంటరా? (అని వెంకన్నను జూచి గద్దించును)

పార్వతి—(స్వగతము) ఎప్పుడూలేనిది పెద్దదొరగారు నేడిట్లుకోపము చేస్తున్నా రేమి చెపుమా? (ఆశ్చర్యపడును)

రామదాసు—తన్ననా తన్నిచూపునా? ఏదీ? వెంకన్నా, కానీరా.

వెంకన్న—చెప్పతావా లేదా? రోలాకోల మనుకున్నా వేంటి నాసంగతి? (తన్నును)

సుబ్బయ్య—(గింజుకొనుచు రామదాసుతో) కాపొడిచేత తన్నిస్తావుటయ్యా బ్రాహ్మణ్ణి? నీవు బ్రాహ్మడవు కాదూ?

రామదాసు—కాపువానిచే తన్నించెదనా? మాదిగవానిచే నీడ్పించెదనా? ఇంకను నిజము చెప్పవా? (మరల కొట్టును)

సుబ్బయ్య—నన్నెందుకు కొడతావయ్యా? ఏమి చెప్పమంటావోయేమి

రామదాసు—ముందు నోరు సరి చేసికో. (అని నోటిమీద కొట్టి) ఇప్పుడు చెప్పుము. నీవు నీయన్నగాడు కలిసి కేశవునివిషయమున చేసిన కుట్ర అంతా చెప్పుము.

సుబ్బయ్య—అయితే సావకాశముగా విను. నీకొడుకున్నాడే కేశవరావు? నీకుమారరత్నము? నీవంశోద్ధారకుడు? నీచిట్టిబాబు?

రామదాసు—(నోటిమీద మరల కొట్టి) అధిక ప్రసంగము చేయకు.

సుబ్బయ్య—ఆమహానుభావుడు దుగ్గిరాల కనకాంగికి కన్నెరికము చేయడానికి చెన్నాపట్టం వెళ్లేడు. సుబ్బిసెట్టికి నోటు రాసియిచ్చి మూడు వేల రూపాయలు పట్టుకు వెళ్లేము. అందులో రెండు వేలు కన్నెరికపు కట్నం తక్కినవి ఖర్చులకి. అవిచాలక ఉత్తరం రాస్తే సెట్టి మళ్లీ నాలుగువందలు పంపేడు. తెలిసిందా? ఇంక చాలా,

రామదాసు—(మరల నాలుగుదెబ్బలు కొట్టి) ఇంక చాలునా? పో బోడీ, (అని త్రోసివేసి) వెంకన్నా, వీనిని వీధిలోనికి గెంటివేయరా.

సుబ్బయ్య—(తీక్ష్ణముగా చూచుచు నిన్నూ, (వెంకన్నను చూపి) ఈవెధవనీ కైదులో పెట్టించేస్తాను చూడు.

రామదాసు—పోరా పూర్వసువాసినీ, నీకు దిక్కున్నచోట చెప్పుకో.

వెంకన్న—పిరాదు రాసి కుంపట్లో దాఖలు చేసుకో తీరుస్తది.

(ఒకచెంపకాయ కొట్టి వీధిలోనికి త్రోసివేయును)

పార్వతి—(స్వగతము) అదిరా, ఎంత పని జరిగింది?

లక్ష్మి—(ప్రవేశించి తలుపునాటున నిలిచి చిటికెలువేసి పార్వతిని

నిలిచి జనాంతికము) ఆగందరగోళ మంతా యేమిటే?

పార్వతి—(జనాంతికము) అది చాలా వుంది. ఇక్కడగాదు. చెబుతానురా తల్లీ,

(ఇరువురు వెడలిపోవుదురు)

వెంకన్న—ఏమిటి బాబయ్యా యీగోరకలి?

రామదాసు—ఇదియా? ఇది ప్రళయాగ్నివిజృంభణము. నీకు తెలియదు పో.

వెంకన్న—(వెడలిపోవును)

రామదాసు—(స్వగతము) అంతయుం దెలిసినది. హా, ఇంక నేటి బ్రతుకు ఏటి సంసారము? ఇంక నిక్కడ నుండిన లోకులు నెత్తిమీఁద వెంట్రుక లుండనీయరు. వారిచే ఆయశస్సును పొందనేల? (వెడలిపోవును)

---

## తృతీయాంకము—ద్వితీయరంగము



### అంతఃపురము

[మంచముమీఁద కూర్చుండి లక్ష్మి, చెంత నిలిచి పార్వతి ప్రవేశింతురు]

లక్ష్మి—పార్వతీ, నీవెఱింగినంతవఱకు నేనెప్పుడయిన నాథునకు వ్యతిరేకము చేసితి నేమో చెప్పఁగలవా? లేకుంటే ఈప్రళయమేల కలుగవలెను?

పార్వతి—మీమీఁద దోషా లెంచేవారు పురుగు లోడి చస్తారు. చిన్నదొరచేసిన యీపనికి నారాయణశాస్త్రులుకంటే కారణ మెవరున్నారు?

లక్ష్మి—మొన్న—సంక్రాంతిపండుగు నాఁడు నాథుఁడు నాచేత శాస్త్రిలుకు ఒక కాసు ఇప్పించెను. శాస్త్రిలుకు నేనేమి అపకారముచేసినాను.

పార్వతి—మీరు చేసిన దానం ఇట్లు ఫలించినది.

లక్ష్మి—ఔను పార్వతీ, ఔను. నాదానాలిట్లు ఫలించినవి. నానోములిట్లు ఫలించినవి. నాపూజలిట్లు పరిణమించినవి. అన్నిటికంటె నాపాపము ఇట్లు పండి ప్రత్యక్షమైనది. ఒకళ్లకు నష్టము చేసిన పని యేమున్నది? పరకాంతలను కన్నెత్తి చూచి యెఱుంగని నాహృదయేశ్వరుడు ఇట్లు వారకాంతకు దాసుడగుట యేమి? అయ్యో యిది నాదురదృష్టము. నాప్రారబ్ధకర్మము. నాపతి మదేకజీవితుడని గర్వించితిని; గాని నానాథుని హృదయమునందలి నాపదవిని ఒక వెలయాలు ఆక్రమించినది. ఇంక నీయిల్లుమాత్ర మాక్రమింపదా? పార్వతీ, ఇంక నేను బ్రతుకుటకంటె చచ్చుట మేలుగాదా?

పార్వతి—అమ్మా, అట్లేల తలంచవలె? మీపుణ్యము మంచిదైతే దొరగారి హృదయము వెంటనే మారిపోగూడదూ?

లక్ష్మి—అది లేనిది; గావుననే యిట్లు జరిగినది. పార్వతీ, నాకు వారకాంత సవతియా? జీవితేశ్వరుడు దాని సెలవు లేనిదే ఇంక నాతో మాటలాడడూ? ఇంక నాకు వారకాంత పసుబత్తెమిచ్చునా? తోడివారందరూ ఇంక నన్ను వ్రేలుపెట్టి చూపి ఈయభాగ్యురాలి మగడు భోగముదానినుంచుకొనినాడని చెప్పుకొందురా? ఓసీ, నాతల తిరుగుచున్నది. పట్టుకోవే. (కన్నులు మూసికొని ఒఱగును)

పార్వతి—(పట్టుకొని) అమ్మా, ఏల మీకీ వెఱ్ఱి?

లక్ష్మి—(మూర్ఛిల్లిపడిపోవును)

పార్వతి—అమ్మా (చూచి) ఈమె మూర్ఛిల్లినట్లు ఉన్నది. ఏమి చేయుదును?

(అప్పుడు కేశవరావు ప్రవేశించును)

కేశవ—పార్వతీ,

పార్వతి—(అటుచూడకయే) వచ్చితివా? హా, చిన్నదొరా, ఎంత పని చేసినావు? చలిచీమలవలె ఉండి నసాళ మంటబొడిచినావే.

కేశవ—పార్వతీ,

పార్వతి—(చూచి) ఎప్పుడు రాక బాబూ?

కేశవ—ఇప్పుడే వచ్చితినే. వాకిటసామాను నడుచున్నది. జాగ్రత్త చేసిరా

పార్వతి—(స్వగతము) జాగ్రత్తచేయడానికి ఇంకా సామాను మిగిల్చవాలంద్రీ?

(అని పోబోవును)

కేశవ—ఓసీ, నాయనగా రెక్కడకు వెళ్లినారు?

పార్వతి—(బొమలుముడిచి) ఇంటనే వున్నారు బాబూ.

కేశవ—లేరే. ఇప్పుడు నేను దిగిన బండిమీఁదనే ఎక్కడికో పోవుచున్నారు. ఎక్కడికో తెలియదూ?

పార్వతి—ఇదేమిటి? ఎవరికీ తెలియదు బాబూ ఎక్కడికి వెడుతున్నారో (స్వగతము) ఇంటిలో ఇదేమి విపరీతము? పెద్దవారి ప్రయాణమేమిటి? (వెడలిపోవును)

కేశవ—(స్వగతము) నాయనగా రెన్నిసారులు పిలిచినా పలుకలేదు. నేను చెన్నపురికి వెళ్లిన కారణము వారికి తెలిసియుండునా? అందుకై కోపించియుందురా? తెలిసికొందును. (మంచముమీఁదనున్న లక్ష్మినిఁజూచి) లక్ష్మి నిద్రించుచున్నట్లున్నది. ఈమె పగ లెప్పుడును నిద్రించియుండఁగదు. నేఁడిది యేమి? నాతోడి విరహము వలననా? అయియుండవచ్చును. (నవ్వి) పాపము. ఏమియు నెఱుఁగని గోల! నేను వెళ్లుట ఈమె కనులార ఎట్లు చూడలేదో అట్లే వచ్చుటగూడ చూడలేదు. ఇది గొప్ప మేలే.

(అని మంచము సమీపించి లక్ష్మిని ముద్దాడును. లక్ష్మి కదలక అట్లే యుండను)

కేశవ—[స్వగతము] నేనింత గాఢముగ చుంబించినను ఈమె మేలుకొనకున్న దేమి? మూర్ఛయై యుండునా? (పరీక్షించి ఒల్లమీఁది కూజాతో మొగముమీఁద పన్నీరు చిలికి చూచి) లేచికొనుచున్నది. (మరల ముద్దాడును)

లక్ష్మి—(లేచి కేశవరాయనిఁ జూచి నాథా, వచ్చితివా? అని యా

తని మెడ కౌఁగిలించుకొని పడియు మూర్ఛిల్లును)

కేశవ—(స్వగతము) ఈమె మరల మూర్ఛిల్లినది. ఈమె విరహవ్యథ యెంత దుస్సహముగా నున్నది? ఇప్పుడేమి యుపాయము? పార్వతీ, పార్వతీ,

(అని పిలుచుచు క్రిందికి బయలుదేఱును)

తెరదించవలెను

---

## చతుర్థాంకము—ప్రథమరంగము

### కనకాంగి గృహము



(పసారాలో నారాయణశాస్త్రి పాప ప్రవేశింతురు)

పాప—దీనివాలకము చూచిన నాకేమీ తోఁచుట లేదు. "ఇదే సమయమే, రాత్రీ, పగలూ, ఆయన నిన్ను కనిపెట్టుకొనియున్నంతకాలమే నీవు ఏదికోరినా వచ్చునే. దాటిపోనీయకే" అని యెంత చెప్పినా వినదు. ఎప్పటికప్పుడే "ఇప్పుడు గాదు. అదుగో తానులే" అని మొండిమాట పలుకుతుంది. మీరేనా కసింత కూకలు పెట్టండురూ.

నారాయణ—పాపా, ఒక్క సంగతి విను. ఎంత సానియింట పుట్టినా మోహమనీ, ప్రణయమనీ, కొంతకాలమైనా ఉండక తీఱదు. ఇంతకూ కనకాంగి రసికురాలు. కేశవరావుగారు చక్కని సరసుఁడు. ఇద్దఱికీ సరిపోయినది. మదరాసులో నుండఁగా ఒకనాఁడు వారి సల్లాపము వింటిని గదా పూర్వకవుల వర్ణనమును మించియున్నది. "ఆహా, విధాత మంచి మిథునమును కూర్చె" నని పరమానంద మనుభవించితిని.

పాప—మీగురుస్వామే యింత చేసినదా?

నారాయణ—చివరకు ముక్తాయింపు నామీఁద నేనా?

పాప—ఇప్పుడే మేల్కొకపోతే యెట్లండీ? యౌవనము దాఁటిన

తరువాత సానిని చూచేదెవరు?

నారాయణ—అది నిజమే; గాని యుక్తాయుక్తవిచారణ వలదా?

పాప—మీదంతా మాఱుదారి. ఇంటికి వచ్చినదే తడవుగ రంగయ్యసెట్టి కబురుచేసినాఁడు. "సంగతి యిది" అని నేను మెల్లగా చెప్పఁబోఁగా కనకి "ఊహూ" అని గుఱ్ఱాలక్కలాగ మొగము త్రిప్పి అవతలకు లేచిపోయినది

నారాయణ—రంగయ్యసెట్టి అంటే? సుబ్బిసెట్టి కొడుకా? ఏడి చిన్నదై యున్నది. వాని యందమునకు, వాని కంఠస్వరమునకు, వాని వాలకమునకు వాని సరసమునకు సాని—అందును కనకాంగి కాపలసివచ్చినదా? నీవు బలవంతముగ వానిని యింటికి దెచ్చితివంటే కనకాంగి అన్నహితవు తప్పి పంచము పట్టును.

పాప—మీమాటలు బాగానే యున్నవి. మీ వేదాంతాలు, మీ మోహాలు, మీ ప్రణయాలూ నావద్ద చెప్పవద్దు. ఒక్క రంగయ్యసెట్టివల్ల సంవత్సరములో పదివేలు సంపాదింపవచ్చును. మీకేమి తెలియును ఈ హావభావాలు?

నారాయణ—నాకేమీ తెలియని మాట నిజమే. నీపుణ్యమాయని ఇట్టి విషయాలు నాకు బోధించకు.

పాప—నాకూఁతురే నేను చెప్పిన మాట త్రోసివేయుచుండఁగా మీరా వింటారు?

నారాయణ—కనకాంగి నేఁడెంత బిఱ్ఱబిగిసినా తుదకు సాటిసానులలో కలియక మానదు. ఆరు మాసములైనా తాళుము.

పాప—(గుండెలు బాదుకొని) అమ్మయ్యో, ఆఱుమాసాలే? ఆఱుమాసాలు. సంవత్సరములో సగము. మూఁడు ఋతువులు. నూట యెనుబది రోజులు. అమ్మో. నావల్లగాదు. రంగయ్యసెట్టి కబురు వినినప్పటినుండీ నాకు ఏరోజు కారోజే తెల్లవారుట లేదు. కామరాజుగారు కనకాంగిని చూడాలనాఁగట. కృష్ణమూర్తిగారు గడుసుతనముగా జాబు వ్రాసినారు.

పాప—ఇఁక నేమి? మీతమ్మునకు నాలుపావులాయలు ఇప్పించినఁగాని మీకు నిద్రపట్టదు. ఈసందడిలో నామాటలు మీకెక్కడ వినబడతాయి?

నారాయణ—ఇదే సరసము తెలియనిమాట. మదరాసులో నీకు నూట పదాఱు లిప్పించేదాఁకా నాకు నిద్ర పట్టినదా!

పాప—అయ్యగారు చేతినరములు వెనుకకు లాగుచున్నవి. ఇఁక త్వరప డినగాని లాభము లేదు. (లోపలకుఁ బోవును)

నారాయణ—సరే. నీబుద్ధి వినియోగించు. (అని ముందునకు వచ్చి గుండెలమీఁద చేయి యుంచుకొని) అన్నా, ఎంత గుండెలుతీసిన బంటురా యిది? ఇంటికివచ్చి మూఁడు రాత్రులైన గాలేదు. అప్పుడే బేరాలు. కనకాంగి యెంతకైన గసికురాలే. ఎంతకైనా ప్రణయపతియే, గాని యీరాకాసిముండ దానిని బ్రతుకనీయదు. ఈక్షణములో ఈముసలిది చచ్చిపోయినయెడల కన కాంగి బ్రహ్మానందపడును. మేమంతా పరమాన్నము చేసికొని తిందుము. కేశవ రావుచేత వేయి బ్రాహ్మణ్యమునకు సంతర్పణ చేయింతుము.

(వెడలిపోవును.)

తెరదించవలెను.

---

## చతుర్థాంకము—ద్వితీయరంగము

### అంతఃపురము



(తివాసీమీఁద కూర్చుండి విచారగ్రస్తయై లక్ష్మి, ఎదుటఁగూర్చుండి ఆమె యన్నకల్లూరి వేంకటరాయఁడు, చెంగట నిలిచి పార్వతి ప్రవేశింతురు)

వేంకటరాయఁడు—చెల్లాయీ, స్త్రీలకు ఇంతకంటెవిచారకారణము ఉండదు. అయినా మనము సంగతియోచించుకోవలెను; గాని యిట్లు విచా రించుచు గూర్చుండిన నెట్లమ్మా?

లక్ష్మి—(విచారముతో) అన్నా, నాకేమి తోచుట లేదు. తలంచుకొనిన నాహృదయము దహించుకొనిపోవుచున్నది. నాబ్రతుకే నాకు భారముగా నున్నది. అమ్మగారిని నాయనగారిని చూచుటకుమాత్రమే నేను బ్రతికియున్నాను. అంతే.

వేంకట—వగచుటవలన నేమి ప్రయోజనమో చనిపోవుటవలనగూడ అదియే ప్రయోజనము. ఏదో యొక కారణమువలన వచ్చిన ఆపత్తును తప్పించుకొనలేక చనిపోవ దలంచుటకంటెను, చనిపోవుటకంటెను మహాష్యమూ, చేతగానితనమూ మఱిలేదు. ఆపదలు శాశ్వతములా? అఖండవిపత్తులలోఁ గూలినవా రెందఱు ఇప్పుడు సుఖపడుట లేదు? ఇంతకును నాయనగారును అమ్మగారును నేఁడే తప్పితే రేపు వత్తురు.

వంటలక్క—(ప్రవేశించి) అమ్మా, (అని యెదుట వేంకటరాయునిఁ జూచి) ఎప్పుడు రాక నాయనా?

వేంకట—ఇప్పుడే వచ్చితినమ్మా.

వంటలక్క—మడికట్టుతో వచ్చును. స్నానము చేయండి. అమ్మా, కేశవరావుగారు భోజనము చేసి వెళ్లినారు. మీరు రారా?

లక్ష్మి—(తెల్లవోయి) అప్పుడే భోజనమే యైనదా?

వంటలక్క—అయినదమ్మా, వెళ్లియే అయిదునిమిషము లయినది.

లక్ష్మి—ఇప్పుడు రాను నేను.

వంటలక్క—నాయనా, మీరు లేవండి.

వేంకట—నాకింకను తొందర లేదు.

(వంటలక్క వెడలిపోవును)

లక్ష్మి—అన్నా, స్థితిగతులు ఇట్లున్నవి. ఇంకా యెప్పుడో బాగుపడితా వందువేల?

పార్వతి—తల్లీ, తరువాత మాట్లాడుకొనవచ్చును. నేఁడుగూడ అన్నము మానినచో జబ్బు చేయును. నామాట విని కొంచెము భుజింపవమ్మా.

వేంకట—(ఆశ్చర్యముతో) లక్ష్మీ, నీవన్నము తినుట లేదా?

లక్ష్మి—(కన్నులు నీరు గ్రుక్కుకొనుచు నూరకుండును,

పార్వతి—లేదండి; ఎన్నివిధాల చెప్పినా నామాట వినటలేదు. ఇట్లు నిరాహారములు మాని విచారించితే ఏమి ప్రయోజనము?

వేంకట—లక్ష్మీ, ఇదేమమ్మా ఇంత విపరీతము?

లక్ష్మి—(దైన్యాతిశయముతో కన్నులు తుడుచుకొనుచు) అన్నా, నా నాథున కెప్పుడీట్టి దుర్దశ పట్టినదో అప్పుడే నాకడుపు నిండిపోయినది నీవు పోయి భుజింపుము.

వేంకట—అయితే నేనుగూడ మానివేయవలసినదేనా?

నేపథ్యమున

పార్వతమ్మా, పార్వతమ్మా,

లక్ష్మి—వెంకన్న పిలుచుచున్నాడు. ఎందుకో పోయిరా.

(పార్వతి వెడలును)

వేంకట—రైలుబండి వేళ దాటినది. ఈబండిలో నాయనగారును అమ్మగారును వచ్చియుండవచ్చును.

పార్వతి—(ప్రవేశించి) ఏలూరుపాటి వెంకయ్యగారు చిన్నదొరకోసము వచ్చినారు. మీరు వచ్చినారని చెప్పగా అవశ్యము మిమ్ము చూడాలి అంటున్నారు.

వేంకట—నీవు ఇక్కడ నుండుము.

(అని క్రిందికి బోవును. వేంకయ్య నిలిచియుండును.)

వేంకయ్య—(ఆనందముతో) ఇదిగో ఎప్పుడు రాక?

వేంకట—మెయిలులో వచ్చితిని. క్షేమమా?

వెంకయ్య—ఆ. న్యాయవాదము బాగుగ జరుగుచున్నదా?

వేంకట—చిత్తము. మీయాశీర్వచనమువలన.

వెంకయ్య—దైవానుగ్రహ మనుము. మీ నాయనగారి యాశీర్వచన

మయము. నేను వచ్చిన పని మఱి యేమియు లేదు. రామదాసుగారు కాశీనుండి తంతి యిచ్చినారు. వారు నిన్న సన్న్యసించినారఁట. పేరు బ్రహ్మానందభారతి. ఇదిగో తంతి. (ఇచ్చును)

వేంకట——(ఆశ్చర్యపడి అందుకొని) జరిగినదానికి చాల విచారము; గాని యిప్పుడా సంగతి బయలుపఱుపవద్దని ప్రార్థన.

వెంకయ్య——స్వామిగారి మనోరథము తలక్రిందుగా నున్నది. ఇందు నావలన మీరు కావలసినంత సాయము పొందవచ్చును. కేశవరావు సంగతి మీ నాయనగారికి తెలిసియుండునా?

వేంకట——చెప్పలేను. వారు నేఁడు రావచ్చును.

వెంకయ్య——సరే. నాతో మాట్లాడుటకు ఒక స్నేహితుఁడు వచ్చియున్నాఁడు. మాట్లాడి యిప్పుడే వచ్చెదను.

వేంకట——ఇప్పుడే వర్తన మీయవలెను.

వెంకయ్య——చిత్తము. (వెడలిపోవును)

వేంకట——(స్వగతము) స్వామిగారి మింత అసందర్భముగా నుండఁగా రామదాసుమామగారు ఇప్పుడే యేల సన్న్యసించినారో తెలియదు. సహజముగ సంసారము నెడల విముఖులై యున్న ఆయన మనస్సునకు కేశవరావు ప్రవర్తనవలన నొప్పి కలిగి యుండవచ్చును. అయినను ఆయన సమయమునకు నాకు తంతి యిచ్చుట కొంత మంచిదే.

(అప్పుడు వేంకటరాయని తండ్రి గోపాలశాస్త్రి, తల్లి పద్మాక్షి బండి దిగి లోనికి వత్తురు)

గోపాలశాస్త్రి——(కుమారునిఁ జూచి) ఇదిగో చిట్టిబాబు వచ్చినాఁడు. (సమీపించి) నీవు ఎప్పుడు వచ్చితి వోయీ?

పద్మాక్షి——(కుమారుని కౌఁగిలించుకొని) నాయనా, నెమ్మదిగా నున్నావటోయీ? కోడలు సుఖముగా నున్నదా?

వేంకట——చిత్తము. నేను మెయిలులో వచ్చినాను. ఇక్కడి సంగతి

యేమీ బాగుగా లేదు. కేశవరావు సానిని నుంచికొనినాఁడు.

పద్మాక్షి—అయ్యో, (అని కూలబడును)

గోపాల—ఏమీ? (వెళ్లపోవును)

పద్మాక్షి—నాయనా, లక్ష్మి బ్రతికియున్నదా? నన్నా మేడకు తీసికొనిపో. (కష్టముమీద లేచి నిలుచును)

గోపాల—ఘోరకలి.

వేంకట—రామదాసుమామగారు కలకత్తానుండి "నేను కాశికి వెళ్లుచున్నాను. ఇఁక రాను. మాయిల్లు నష్టముగ కాసిపోవుటకు సిద్ధముగా నున్నది. పోయి కాపాడుము. దేవుని చిత్తము భద్రము" అని తంతి యిచ్చినారు.

గోపాల—ఆయన నాకుగూడ ఇట్లే తంతి యిచ్చినారు.

వేంకట—నేను ఇచ్చిన తంతి మీకు చేరలేదా?

గోపాల—లేదు.

వేంకట—మామగారు కాశిలో నిన్న సన్న్యసించినారఁట. ఏగూరుపాటి వెంకయ్యగారు ఇప్పుడే ఆ తంతి యిచ్చినారు.

గోపాల—తంతి ఆయనకు వచ్చెనా!

పద్మాక్షి—ఈలాటి సమయములోనా ఆయనకు సన్న్యాసము.

వేంకట—అవును.

గోపాల—అట్లయిన ఆయన చెంతకు పోయిరా. ఈ సంగతి యింకా వెల్లడి కాఁగూడదు.

వేంకట—నేను ఆకట్టుదిట్టమంతా చేసితిని.

గోపాల—అట్లయిన వదనము మేడమీఁదికి—లక్ష్మి యెక్కడ నున్నది?

వేంకట—మేడమీఁదనే. దయచేయండి.

గోపాల—మీయమ్మను పట్టుకో.

(అందఱును మేడమీఁదికిఁబోవుదురు. అప్పుడు ఏగూరుపాటి వెంకయ్య వచ్చును)

వెంకయ్య—వేంకటరాయఁడుగారూ,

(అని పైకి చూచి పిలుచును)

నేపథ్యమున

వచ్చుచున్నాను.

వేంకట—(ప్రవేశించి) నాయనగారు వచ్చినారు.

వెంకయ్య—అమ్మగారో?

వేంకట—వారును వచ్చినారు.

వెంకయ్య—అవును. తెలిసిన పిదప ఒక్క క్షణమైన నుండలేరు.

వేంకట.—(పైకిచూచి) పార్వతీ, (అని పిలుచును)

నేపథ్యమున

ఏమి బాబూ?

వేంకట—ఇక్కడ నాయనగారి పని యున్నది.

వెంకయ్య—తొందరలేదు. వారే వచ్చెదరు.

గోపాలశాస్త్రి—(ప్రవేశించి) ఇదిగో వెంకయ్యగారా?

వెంకయ్య—చిత్తము. వ్యవహార మంతయు తలక్రిందుగా నున్నది. సమయానికి మీరు వచ్చుట చాల మంచిదైనది.

గోపాల—అంతా మీచేతిలో నున్నది. రామదాసుభావగారు సన్న్యసించినవార్త ఇంకను వెల్లడి కానీయవద్దని ప్రార్థన.

వెంకయ్య—ప్రార్థన అనవద్దు. ఆజ్ఞాపన అనండి. మీసెలవునకు బద్ధుడను. వారముదినములక్రిందట మారామదాసు అన్నగారు నాపరముగా నొక బ్రాహ్మణునకు వేయిరూపాయలు బదులు ఇచ్చినారు. ఇదిగో ప్రోనోటు జాగ్రత్త చేయుఁడు.

గోపాల—(వెంకయ్యను కౌగిలించుకొని) మీతండ్రిగారికిని నాకును గల స్నేహమును నిలిపినారు. మీసౌజన్యమునకు ఆనందము. మీసాహాయ్యము మాకు పూర్తిగా కావలయును.

వెంకయ్య—చిత్తము. భోజనము చేసివచ్చెదను. పిమ్మట సావకాశముగ మాట్లాడుకొనవచ్చును.

గోపాల—అవును.

వేంకట—మరల శీఘ్రముగా దర్శన మీయవలెను.

వెంకయ్య—చిత్తము.

గోపాల—అబ్బాయీ, అది గాదు. వెంకయ్యగారూ, ఈపూట మాకు మీ సహపంక్తి దయచేయవలెను. మీరు వెళ్లగూడదు. (అని చేయిపట్టుకొనును)

వేంకట—అవును. అది బాగుగా నున్నది.

వెంకయ్య—చిత్తము. మీసెలవు. స్నానము చేసి వచ్చెదను.

గోపాల—ఆనందము (చేయివిడుచును)

తెరదించవలెను.

---

## చతుర్థాంకము—తృతీయరంగము

(నారాయణశాస్త్రి, రంగయ్యసెట్టి ప్రవేశింతురు)

నారాయణ—ఎందుకు చెప్పెదరు లెండి. ఇంకా కొన్నిదినాలదాఁకా పైవ్యవహారాలకి పాపరేు అంగీకరింపదు.

రంగయ్యసెట్టి—ఆమాటకి నేను అంగీకరించను. పాప ఆటితేటిన పాని. దానికి డబ్బే ప్రధానము. అందులోనూ నావిషయంలో అడ్డు చెప్పదు.

నారాయణ—మీరట్లు అనుకోవద్దు. కలిసిపదునైదు దినములుకాలేదు. ఇంతవఱకు కేశవరావుగారివల్ల మూఁడువేలు ముట్టినవి. ఇంకా బోలెఁడంత ముట్టనున్నది. కనకాంగి అల్లరిచిల్లరిపనులు ఎంతమాత్రము చేసినట్లు తెలిసినా ఆయన మఱి ఆవైపు కన్నెత్తి చూడఁడు.

రంగయ్య—నన్నేమి చేయాలేమంగదా?

నారాయణ—ఏమో. అది నేనెట్లు చెప్పగలను?

రంగయ్య—ఇంక ఆమాటలు కట్టిపెట్టండి. నోరెత్తితే నోట్లు కోర్టులో దాఖలుచేస్తారు. కామరాజుగారియింద దావాచేసినప్పటినుంచీ సబుజడ్జీగారు మన చేతులో వున్నారు. నిమిషంలో కేశవరావుమీద జప్తుకు వారంటు.

నారాయణ—సరే నాయనా, మీబలాబలాలు మీరు చూసుకోండి. మధ్య నాకెందుకూ ఈగొడవలు?

రంగయ్య—అవును. ఈగొడవలతో మీకు పని లేదు. మీగొడవలు వేరు. చూడండి. (అని శాస్త్రిచేయి పుచ్చుకొని ఒక నోటు ఉంచి) ఇంక మాట్లాడకండి. గప్-చిప్. క్షణంలో వ్యవహారం ఫయిసలు కావాలి. మా అయ్యకు తెలియగూడదు.

నారాయణ—(స్వగతము) ఏబదిరూపాయల నోటు. ఇంతటితో తృప్తి పడనా? చాలదు. (ప్రకాశము) అయ్యా, నాకు అక్కరలేదు. నేను ప్రయత్నించెదను. అందుకు మీరు నాకు ఏమీ ఈయనక్కరలేదు. మీనోటు మీరు పుచ్చుకోండి. ఈయబోవును)

రంగయ్య—అందుకోసం గాదు. నోటుమీవద్ద వుండనీయండి. (శాస్త్రులు చేయి దూరముగ నుంచును)

నారాయణ—వద్దువద్దు. నామాట వినండి. (మరల ఈయబోవును)

రంగయ్య—శాస్త్రులుగారూ, ఈ సాహసము మీకు తగినది గాదు. ఇదిగో పుచ్చుకోండి. (మఱియొక నోటు బలవంతముగా చేతిలో నుంచును)

నారాయణ—వద్దువద్దు. (అనుచునే పుచ్చుకొని స్వగతము) ఇంకొక నూఱు రూపాయలు. మొత్తము నూటయేబది. సంవత్సరగ్రాసము. ఎన్ని దినములు కష్టపడిన వచ్చును? (ప్రకాశము) సరే. నేను డబ్బే ప్రధానముఅయిన వాడనని మీరు తలంచినట్లు ఉన్నది. అయినా బీదవాడను గనుక పుచ్చుకోవలసినది.

రంగయ్య—శాస్త్రులుగారూ, నాకు పనే ప్రధానంగాని డబ్బు గాదు. నా సంగతి యింకా మీకు బాగా తెలీదు. కొన్నాళ్లు పోనీయండి మీచేతనే "అబ్బో, కేశవరావు" అనిపిస్తాను.

నారాయణ—అయితే వినండి పని. నేటిరాత్రి వాళ్లు మేళానికి వెళ్లుచున్నారు. వారముదినములు అక్కడ రారు. వచ్చిన పిదప మీవ్యవహారము—

రంగయ్య—చూడండి. వెళ్లినచోట అయితే మనకి మరీ మంచిది. అయ్యాకి అనుమానమే కలగదు.

నారాయణ—అయితే మూడోమేలు. ఇక శుభము.

రంగయ్య—సరే. దయచేయండి. మీరు బట్టలు గిట్టలు ఏమయినా కావలిస్తే కొట్టుమీదికి వెళ్లండి. గుమాస్తాతో చెబుతాను రహస్యంగా. చూడండి. అక్కడి బేరం తగ్గాలిసుమండీ.

నారాయణ—ఆమాట నాకు చెప్పవలెనా? నాతో వ్యవహారము చెట్టు చెట్టులాగున ఉండవలసినదే. పైవాళ్లు రాలుకు గాయలతో తృప్తిపడవలసినదే.

రంగయ్య—ఆఁ. అట్లుండాలి వ్యవహారం. మీకు తెలవ దేముంది? అబ్బో. సానోళ్లకి గురువులోరు.

నారాయణ—అయినా కోమట్లవద్దనా? మరిసెలవు. (అని ముందుకు వచ్చి స్వగతము) ఎవడు ఎట్లు పోయిన నాకేమి? ఒక్క కేశవరావు సేనమ్మ కోని యింటే లాభము లేదు. కనకాంగి నామాటకు అడుగుదాటుట లేదు గదా? ఈరీతిగా నలుగురు ధనవదాన్యులను దాని పాదములవద్ద కూలవేసితి నంటే దానికి, నాకుకూడా రాజయోగమే. ఇక పైనాళ్ల సంగతి నాకెందుకు? ఈసమయములోనే మేలుకొంటే నాలుగురాళ్లువొరకును. కామరాజు ఒకఁడు వెంటఁ బడుచున్నాఁడు. ఆయనచేయి అంత పెద్దది గాదు. ఋణాలలో పడి ఉన్నాఁడు. పైగా ఇంటివద్ద భార్య పెత్తనము. అయినా వదలఁ గూడదు. కనకాంగి మోహములో కాకినాడలో ఉన్న వారముదినములు దానికి కాసులతో అభిషేకము అయితే నాకు రూపాయలతో. నాప్రజ్ఞ యొక్కడ

ఉన్నదంటే! పాప ఎంత ఘనవంతుని—ఎంత పదవులుచేయువానిని తెచ్చినా కనకాంగి నాయాజ్ఞ లేనిదే మఱి మాట్లాడఁగూడదు. నలుగురువిషయములో ఇట్లు జరిగినా మఱి పాపగూడ నన్ను విడువదు. నాకేమీ అభ్యంతరము చెప్పదు. కనకాంగికి మాత్రము బంగారము కురిపించవలెను. నాకేమి నష్టము? అది నాకుగూడ లాభకరమే. నాకీనాడనుండి మేము వచ్చునంతవఱకు కేశవ గావు హాయిగుంటఁబడి తినుచుండుఁగాక. ఈతఁడు పిల్లివాల వెంటఁబడిరాకుండ నుంచి అడ్డే తగిలినది.

తెరదించవలెను

---

## చతుర్థాంకము—చతుర్థరంగము



నారాయణశాస్త్రి యిల్లు

(ఒక గదిలో నులకమంచముమీద కూర్చుండి కేశవరావు పుస్తకము చూచుకొనుచు నుండును)

కేశవ—(చూచుచున్న పుస్తకము నొకచేతఁబట్టుకొని) ఎంత మంచి కల్పన యెత్తినాఁడు కాళిదాసు "యువతిజనేషు శనైశ్శనై రనంగః" అంటూ. మిగిలినకవులకు తోఁచని ముఖ్యమైన భావము ఇది. ఇది లేకుంటే తక్కిన శ్లోకము కేవలము శబ్దముల సమూహమే. దీనితో ఎండుకట్టె చిగిర్చినట్లయినది. అయితే యీకల్పన యెత్తిన కాళిదాసు గొప్పవాఁడా? కాళిదాసు కవనమునందలి ప్రత్యేకతను గ్రహింపఁగలిగిన భోజుఁడు గొప్పవాఁడా? ఇదీ విషయము. కల్పన, గ్రహణము ఇక్కడతూఁచవలసిన వస్తువులు. కల్పన అంటే చిన్నదో, పెద్దదో, నీరసమైనదో, సారసమైనదో యేదో యొకభావము ప్రతివానికి—(అగ్గొత్తిలో నల్లికుట్టఁగా దిగ్గున ఉలికిపడిలేచి) ఎంత గట్టిగా కఱచినదీ నల్లిపోను? నలుసంత నల్లి. అణువుకంటె చిన్నదోయి; గాని కాటు మాత్రము

ముకుందగిరి బల్లెపుపోటును పొడిచినది. నల్లగుండెను వాడిబాణము నాటినట్లయినది. దీనిబాధ యింత దనుక ఏలనో కాఁబోలు నల్లులను నాశనము చేయు మందుల ప్రకటనలు ప్రతివార్తాపత్రికయందును కుప్పతిప్పలుగా నుండును— ఈమంచముమీఁద రాత్రి పరుండుట యెట్లు? తాటాకుల చాపమీఁద పరుండవలసినదేనా? (యోచించి) జమీందారుల మందిరములను మించు దివ్యభవనము ఉండఁగా నాకీగతి యేమి? సన్నబియ్యపుటన్నము, వేపుడు కూరలు, అప్పుడు కాచిన నేయి, మీగడతోడి పెరుగు వెండిపళ్లెము నుండఁగా నాకీపాట్లేమి? కుషనుషీటుకుర్చీలు, హంసతూలికాతల్పము నుండఁగా నాకీయవస్థ యేమి? నాకు ఈయజ్ఞాతవాస మేల? నాయింటినుండియే నేను కనకాంగి యింటికి బోయిన—అథవా, దానిని నామేడకే తెచ్చుకొనిన నాకడ్డు చెప్పఁగలవాఁడెవఁడు? లోకులు వ్రేలుపెట్టి చూపిన పసగవాఁడను నాకు బాధ యేమి? ఛీ, సాంకేయూరున—దివాలాకోరువలె—అప్పులవాళ్లకు జడిసి దాఁగినవానివలె యీపరాయియింట—ఒక బీదవానితాటియాకుల కొంపలో—రహస్యముగా నేనిట్లేల పడియుండవలెను? నేను నాయింటికే పోయి సుఖముగా నుండును. (అని నట్టింట కొంచెము ముందునకు నడిచి నిలిచిపోయి) ఏమితోఁచినది; ఇంటికిఁ బోయి ఏమొగము పెట్టుకొని లక్ష్మిని చూడఁగలను? పార్వతీపరమేశ్వరులవంటి అత్తమామలయెదుట ఎట్లు నిర్భయముగా సంచరింపఁగలను? యుగంధరుని మించిన నయశాలి వేంకటరాయఁడు బావయెదుట చైతన్యముతో నెట్లు నిలువఁగలను? నేనెంత తెలివితక్కువ పని చేసితిని? నారాయణశాస్త్రి చెప్పుట, నేను చేయుటయునా? ఏమి మంచికార్యమని సాహసించి యీ పని చేసితిని? సానులకు కన్నెరికముచేసినవారు అనేకు లున్నారు. సానుల నుంచుకొనినవా రనేకు లున్నారు. కన్నెరికపు దినములలో లేని భీతి నాకు ఇపు డేల? ఛీ, ఇంత మూర్ఖుఁడనైపోయితి నేమి? పిల్లజమీందారుఁడను, సకల వ్యవహారముల నెఱిఁగినవాఁడను, సంస్థానములను బాలింప శక్తి గలవాఁడను— ఒక వేశ్యాపురుషు—తార్పుడుకాఁడు చెప్పినట్లు నడుతునా? ఎంత పొరబాటు?

ఎంత తప్పు? ఎంత తెలివితక్కువ పని? (క్రిందికిఁజూచి) గోతిలో పడిపోయితిని. అంధకారబంధుర మగు పాడునూతిలో కూలఁబడితిని. ఇఁక నింటికి పోయి నను ఊరకున్న పోదు. ఈవార్త మాయదు. ఊరు ఇఁక మానదు. "కేశవరావు సానినుంచుకొని భార్యను అత్తమామలను చూచుటకు మొగము చెల్లక కొన్ని దినములు ఒక దరిద్రుని యింట దాఁగినాఁడు" ఈవాదు ఇఁక నీజన్మములో పోదు. (శిరముకొట్టుకొని) అయ్యో, చెడితిని. (నుదుట చేయి నుంచుకొని యాలోచించి) నాబ్రతుకు ఎన్ని విధముల పాడైనది? ఏయూరిసాటివారి యింటఁబుట్టి, కల్లూరివారి దౌహిత్రుఁడనై, వారి పిల్లను పెండ్లియాడుట యేమి? సానిదానికి కన్నెరికము చేయుట యేమి? ఎంత పాడుపని? ఎంత నిర్భాగ్యప్రారబ్ధము? అనేకులకు వేలకొలఁది అప్పుపెట్టఁగలవాఁడను ఒకనివద్ద అప్పు పుచ్చుకొని బ్రతుకుట యెఱుఁగనివాఁడను మాయపన్ని, పాదసేవకు తొందరపడుచున్న కులకాంతను ఎడమకాల తన్ని ఈపాడుపని నిమిత్తముచేసి పట్టణముపోవుటా? అయ్యో, భ్రష్టుఁడనైతిని. దేవగురువులంటి నారాయణగారి వార్త తెలియుదల్యేను. బావకని బోలు లక్ష్మి యింట నిద్రాహారములు మాని యుండుచుండెను. నేను వారకాంత యింటి పాపమా? దానిని విడిచి యుండలేకపోవుటా? కాకినాడనుండి అది వచ్చినందులకు దనపాత్ర మెట్టిని తెలిసి బెంగయా? దానితోఁగూడ కాకినాడ వెళ్లుటకుపిలువలేక ఇక్కడ ఇల్లు కుదుర్చుటా? ఛీఛీ, ఏమి పని యిది? ఇంతకంటె నరకము వేరేలేదు. (కన్నులు మూసికొని యాలోచించి) కనకాంగి — నేను కన్నెరికము చేసిన సానిపిల్ల త్రోసివేయవలసినదేనా? దానిని ఇంత భక్తి? ఎంత ప్రేమ? — గాని అది నాయొక్కనితోడనే యుండిపోవునా? పాప అట్లు ఉండనిచ్చునా? కనకాంగికి ఈకీర్తి నిలుచునా? కాకినాడలో గర్భభంగము కాకుండ ఇంటికి చేరునా? అయితే నారాయణశాస్త్రి మేళముతోఁగూడ వెళ్లవలసినపని యేమి? మొన్న రంగయ్యసెట్టి కబురు చేయఁగా పోయివచ్చి జరుగుచున్నగతి మాట్లాడుట కని చెప్పెను. అది నిజమే యగునా? రంగయ్య కనకాంగిమీఁద కన్ను వేసియుండునా? (ద్వారము దెస

జూచి) సుబ్బయ్యా. (అని పిలుచును)

సుబ్బయ్య.—(ప్రవేశించి) ఎందులకు?

కేశవ—చూడు. రంగయ్యశెట్టిదగ్గరకు బోయి నా పేర ఖర్చు వ్రాసి కొని యేబదిరూపాయ లిమ్మని తీసికొనిరా.

సుబ్బయ్య—సరే. (వెడలిపోవును)

కేశవ—(స్వగతము) రంగయ్య సంగతి దీనితో కొంత తెలియగలదు. అతని బుద్ధి మంచిది గాదు. కొంతకాలము నిలాటలము కూతురు నడచుకొని యిప్పుడు సుఖజాడ్యములతో బాధపడుచున్నాడు. సుబ్బిశెట్టిమాట కొడుకువద్ద గడ్డిపోచయును అగుట లేదు. అతని సంపాదన ఇతని ఖర్చునకు చాలుట లేదు. (యోచించి) ఈవిషయమున నేను రంగయ్య నాక్షేపించుటా? నెల మీద పదిదినములలో నాలుగువేలు బూడిద చేసినవాడను ఒకని ఖర్చును గుర్తించి నేను విమర్శించుట యేమి? నాయనగారి నిర్వాహకత్వమును మంట గలుపుచున్న నేను సుబ్బిశెట్టిగారికొడుకు నాక్షేపించుట యెందులకు?

సుబ్బయ్య—(ప్రవేశించి) రంగయ్య గ్రామములో లేడు. కాకినాడ వెళ్లినాడట. వారముదినములవరకు రాడన్నారు. (వెడలిపోవును)

కేశవ—సరే. (స్వగతము) తేలినది సంగతి. (ఉద్వేగముతో) కనకాంగి చెడిపోయినది. ఈకుట్ర శాస్త్రి పన్నినాడు. లేకుంటే శాస్త్రి కిప్పుడు కాకినాడలో నేమి పని? అన్నా, ఎంత పని చేసినాడు శాస్త్రి? ఇంతకంటె కృతఘ్నత యుండునా? ఇంతకంటె ద్రోహము ఉండునా? శాస్త్రి నుప్పు పాతర వేసినను పాపము లేదు. సరే. ఇంటికి రానిమ్ము—శాస్త్రి గడ్డితింటే, పాప పూరి మేస్తే, కనకాంగికైన అన్నము తినదా? ఏమో? చెప్పలేము. ఎటు నిశ్చయించుటకును వీలు లేదు. చెడుటకు మాత్రము అవకాశములు చాలఁ గలవు. ఇంతకూ నిజము తేలుట యెట్లు?—(ప్రకాశముగా) సుబ్బయ్యా,

సుబ్బయ్య—(ప్రవేశించి)ఎందుకు?

కేశవ—(యోచించి) సరే. ఇప్పుడు కాదు పో.

సుబ్బయ్య—(స్వగతము) ఇతనికి మతి పోవుచున్నట్లున్నది. (వెడలి పోవును)

కేశవ—(స్వగతము) నాకీ కంగారు ఎందులకు? అది యెట్లు పోయిన నేమి? ఇంకను కనకాంగితో సుఖింతునా? (యోచించి) ఎట్లయినను నారాయణశాస్త్రి నన్నుచెఱుపను ఈయేకాంతవాసము తప్పదు. ఎప్పుడో చేసిన పాపము ఇప్పుడు అనుభవించుచున్నాను. నాయనగారివార్త కొంచెము తెలిసిన స్థైర్యముతో నుందును. లక్ష్మి కుశలవార్త రవంత తెలిసిన ఈయాతుజడి లేకపోవును; గాని ఏమి చేయవచ్చును? తొందరకద్దు.

తెరదించవలెను.

---

## పంచమాంకము—ప్రథమరంగము



కేశవరాయని గృహము

(తివాసీలమీఁద కూర్చుండి గోపాలశాస్త్రి వేంకటరాయఁడు ప్రవేశింతురు)

వేంకట—రొక్కము ఎనిమిదివేల మూఁడువందల డెబ్బది రూపాయల మూఁడు అణా లున్నది.

గోపాల—పత్రములు?

వేంకట—దస్తావేజులు ఇరువదివేల కున్నవి. అందు అనేకములు తనఖామీఁద పుట్టినవి. ప్రోనోట్లు పదివేల కున్నవి. ఈయంకెలు అసలు. వడ్డీ రూపాయకు తక్కువ లేదు.

గోపాల—తీరుమానము లెట్లున్నవి?

వేంకట—దస్తావేజుల తాలూకు వాయిదాలు ఒకటిరెండు మాసములు హెచ్చుతక్కువగా సరిగా వసూలుచేయఁబడుచున్నవి. ప్రోనోట్లు రెండు సంవత్సరములు మించినచో తిరిగి వ్రాయించుకొనఁబడుచున్నవి. వసూళ్లుకూడ

సరిగనే యున్నవి.

గోపాల—ఇంతలో కాందోషముపట్టనవి లేవుగదా? సరిగా చూచితివా?

వేంకట—లేవు. చూచితిని. పదివేల రూపాయలు తాకట్టుమీఁద నున్నవి. అన్నియు బంగారువస్తువులు. వానిపరిశీలనముగూడ సరిగనే యున్నది.

గోపాల—సంచినిలువ విత్తానికి సరిపోయినవా?

వేంకట—లేదు. రెండువందల పదిరూపాయలు సంచిలో తక్కువ. అవి మామగారు కాశికి పోవునప్పుడు తీసికొన్నారేమో. పార్వతి చెప్పిన మాటలు చూడఁగా ఆయన చేత చెంబు పుచ్చుకొనుటకుఁగూడ వీలు లేనంత తొందరగా ఇల్లు విడిచినట్లు తోఁచుచున్నది. ఆకారణముచేత ఆబాపతు ఏదో చిత్తాలో వ్రాయఁబడలేదు.

గోపాల—ఈసంవత్సరము సాదరు ఎట్లున్నది?

వేంకట—పదునొకండువందల ముప్పది రూపాయలు ఖర్చు ఉన్నది. నెలకు నూఱు రూపాయల చొప్పున తేలుచున్నది.

గోపాల—బాగానే యున్నది. మనకు నూటయేఁబది యగుచున్నవి.

వేంకట—చెల్లాయి యినుపపెట్టె చూచితిరా?

గోపాల—అన్నియు నున్నవి. చంద్రహారముమాత్రము లేదు.

వేంకట—చంద్రహారమే?

గోపాల—అవును. అమ్మాయి తెలియదనుచున్నది.

వేంకట—వేయిరూపాయల పైచిల్లర. అది సానిపాలై యుండును. ఇది శోధింపఁదగిన విషయమే.

(అప్పుడు ఏలూరుపాటి వెంకయ్య ప్రవేశించును)

వేంకట—దయచేయండి. (తాను జరిగి తివాసీ చూపును)

గోపాల—ఇక్కడిక్కడ. (తనవద్ద చూపును)

వెంకయ్య—(గోపాలశాస్త్రివద్ద కూర్చుండును)

గోపాల—ఎట్లున్నది?

వెంకయ్య—జోరుగానే యున్నది.

గోపాల—ఏమాత్రము?

వెంకయ్య—ప్రోనోటు మూడువేల కున్నది. నాలుగువంద లొక బాపతు, రెండు వందలొక బాపతు చిల్లరలో ఖర్చున్నది.

గోపాల—ఏమంటాడు శెట్టి?

వెంకయ్య—"మోసపోయినాను. క్షమించండి." అని చేతులు పట్టుకొన్నాడు.

గోపాల—(కొడుకు వెనుజూచి) మొత్తము అయిదువేలకు మించినది.

వెంకట—అవును.

వెంకయ్య—ఎట్లు?

గోపాల—ఇంటి చంద్రహారము కనిపించదు.

వెంకయ్య—శ్రీహరీ, అది లక్ష్మిని విడిచి ఎక్కడనుండిన అక్కడ సర్వనాశమే.

గోపాల—కావచ్చును.

వెంకయ్య—అగును. నేడు కాకుంటే రేపు. మాసములు దాటవు.

వెంకట—ఆర్థికవిషయ మిట్లున్నది. ఇక నడుపవలసిన తంత్రము?

గోపాల—యోచింపుము.

వెంకయ్య—యుగంధరులు. మీరు మేము చెప్పవలెనా?

వెంకట—ఇది స్వవిషయము. పైగా మీరు స్థానికులు.

వెంకయ్య—ఏమయినను మీరు చెప్పునది గూడ మేము గ్రహింపలేము. మా తెలువు లంతటివి.

గోపాల—కేశవరావు సంగతి? కాకినాడ వెళ్లినవాడు ఏమయినట్లు?

వెంకట—ఈయూరనే యున్నాడు. వెంకయ్యమామగారూ, మీరు శ్రమపడవలెను.

వెంకయ్య — నిద్రాహారములుకూడ విడిచి పనిచేసెదను.

వెంకట — ముందు పూటకూటియిండ్లన్ని చూడవలెను. సానియింటనే కూడ ఉండవచ్చును. నామనస్సు నారాయణశాస్త్రి యింటిదెసకు పరుగెత్తుచున్నది.

గోపాల — అది కేశవరావువంటివానికి నివాసయోగ్యమా? నిలుచుటకు కూడ అవ్కాశ లేని దని విన్నాను.

వెంకట — దివ్యభోగము విడిచి ఉన్నయూరున పూటకూటియింట తిన్నవాడు ఇంద్రభవనము విడిచి గుడిసెలో నుండుటలో సందేహము లేదు.

వెంకయ్య — కాని యొకటున్నది. శాస్త్రిభార్య పడుచుపిల్ల. కొంచె మందగత్తె. శాస్త్రి సంశయాత్ముడు.

వెంకట — కేశవరావువిషయమున ఆయభ్యంతరము లుండవు. పైగా చెప్పుదెబ్బలు తినిన సుబ్బయ్య కాపుండును.

వెంకయ్య — బాగున్నది ఆలోచన. కావచ్చును. మీసెలవయినది. ఇంక నీయూరున ఇండ్లే గాదు. భూమిగూడ తిరుగవేసెదను.

గోపాల — మీశ్రమ చెప్పనలవి గాకుండ నున్నది. మీఋణము తీర్చుకొనుటకు మార్గములు లేవు.

వెంకయ్య — (చేతులు జోడించి) మహానుభావా, అట్లనవద్దు. ఇది వేదమూర్తికి సేవ. పతివ్రతాశిరోమణికి పాదసేవ. తపస్సు చేసినను లభింపనివి యివి. రామదాసుఅన్నగారు నాకు చేసిన సాహాయ్యముముందు ఈసేవ అణుపును బోలదు.

గోపాల — (వెంకయ్య మోడ్పుకేలు పట్టుకొని) మీసౌజన్యము దేవలోకమునగూడ లోభమును పుట్టించును.

వెంకయ్య — వారముదినములలో కేశవరావును ఇంటికి తీసికొనివచ్చు భారము నాది.

గోపాల — ఇప్పటి స్థితిలోనా?

వెంకయ్య—కాదు. సంపూర్ణ మయిన పశ్చాత్తాపముతో. గాని యొక ప్రశ్న.

గోపాల—ఏమి టది?

వెంకయ్య—కేశవరావు ఇంటికి వచ్చుటయేమో క్షణము; గాని వానిని ఎవరును ఏమీ—

గోపాల—ఎందుకు? ఏమీ అన నక్కరలేదు. అతని గుణము చాల మంచిదంట. ఏగ్రహదోషములవలననో యీమచ్చ కల్పించినది. సమయమునునే అతని బుద్ధి త్రిప్పవచ్చును.

వెంకయ్య—అదే నాయభిప్రాయము.

వెంకట—అసలు అతడు మానాయనగారి యెదుటబడుటకే సందేహించును. ఎదుటబడిన తరువాత ఇక వానియింటికి పొమ్మనినను పోడు.

వెంకయ్య—అవును.

గోపాల—నాకు స్నానమునకు సెలవీయండి. మీరు శీఘ్రముగా రావలెను. అబ్బాయీ, ఆలోచనలోబడి బావగారికి ప్రొద్దుపోనీయకు.

వెంకయ్య—బాధలేదు బావగారూ, మీరుదయచేయండి.

వెంకట—ఆలోచనయే లేదు.

గోపాల—(నిష్క్రమించును)

వెంకట—మామగారూ,

వెంకయ్య—ఏమి సెలవు?

వెంకట—మీరట్లనవద్దు. గ్రామములో మీపలుకుబడి యెట్లున్నది.

వెంకయ్య—ఏమీ లోటు లేదు. కూలికి విష—

వెంకట—అయితే చాలు. మీరు ఆవులించిన ప్రేవులు లెక్కింతురు. పైగా నన్ను కొండ యెక్కింతురు.

వేంకట—గరుడుని యెదుటి గ్రద్దను. ఏలూరులో మీయింట కొన్ని దినములుండి శుశ్రూష చేయ నభిలాష గలదు. ఎప్పుడో యొకప్పుడు యీ భారము మీమీద వేతును.

వేంకట—మా గృహము సమీప మగును. "ఆ మహాత్ముని పాదధూళి నా శిరమునం దాల్చు" గాని దేహము దహిప నటనకే రాదనుకొంటి.

వెంకట—ఎప్పుడో జరిగిన పొరపాటు మాటిమాటికి ఉచ్చారించుట ధర్మము గాదు.

వేంకట—క్షమింపవలెను. మీరు స్నానము చేసి దయచేయుండి.

వెంకయ్య—నిమిషము. (వెడలిపోవును)

వేంకట—(స్వగతము) ఎంత పని జరిగినదే! లక్ష్మి సంప్రహారమే! దానిని సరించుటకు పరాయివాళ్లకు ఎన్నికేల గుండెలుండవలయును? అయిదు వేల ఋణము. ఇందులకై నేనా యిట్టి పాలు తాళము త్రిప్పుదును?

గీ. వస్తుతత్త్వమ్ము తెలియంగ వసతు లుండి
వంటయనాథ మేల? అర్థికము నేల?
అడవి యాపిరిక నూరించి కడలి నుప్పు
దెచ్చి కలిపించి రోగార్తు తృష్ణ తీర్తు.

తెగడించవలెను.

---

## పంచమాంకము—ద్వితీయరంగము

ఊరిబైట శివాలయపురోవగట్టు



(సుబ్బారాయఁడు కూర్చుండి యుండును. వేంకటరావు ప్రవేశించును)

వేంకట—ఓహో, సుబ్బారాయఁడుగారు ముందే వచ్చినారే.

సుబ్బా—దయచేయండి. ప్రతిదినము మీరు గుడివద్దకు వత్తురు; గాని గుడిలో మాత్రము అడుగు పెట్టరు కాఁబోలు.

వేంకట—ఔనండీ. అది నాకు వ్రతము. పామరులవలె మనముగూడ రాతిబొమ్మకు మ్రొక్కుట యేమిటండీ? ఈగుడిలో తప్ప ఈశ్వరుఁడు మఱి యెచ్చటా లేఁడా?

సుబ్బా—ఆహా, ఎంతయసిద్ధాంతమండీ మీది? మెచ్చుకొనవచ్చును.

వేంకట—కాకుంటే ఇట్టి మూర్ఖపు పని యెవఁడు చేయునండీ?

సుబ్బా—మాదండి పాశ్చాత్యులను?

వేంకట—ఏమి?

సుబ్బా—వారు చర్చికి ఎందుకు పోవుదురు?

వేంకట—దేవుని ప్రార్థించుటకు. వారికి దైవభక్తి మెండు.

సుబ్బా—అయితే చర్చికి పోయి ప్రార్థించనగాని దేవునకు వినిపించదా? దేవుని చెవులు చర్చిలోమాత్రమే యున్నవా?

వేంకట—ఏమన్నారు?

సుబ్బా—కోపించిన చెప్పఁజాలను. బైట నెట్టి శూన్యస్థల మున్నదో చర్చిలోఁగూడ నట్టి శూన్యస్థలమే యున్నది. ఎక్కడకు వెళ్లినా శూన్యమే యగునప్పుడు బైటనున్న శూన్యతనే యంగీకరింపఁగూడదా?

వేంకట—ఇది యోచింపతగినదే; గాని మీరు ఎప్పుడూ అడ్డప్రశ్నలే వేయుచుందురు. ఏవిషయమునందును మీరు సంస్కారమును అంగీకరింపరని తోఁచుచున్నది.

సుబ్బా—మీయభిప్రాయమున పూర్వులు చేసిన నియమముల నన్నిటిని తలక్రిందుగా దిద్దివేయుటయే సంస్కారమని తోఁచుచున్నది.

వేంకట—మీప్రశ్నలకు బదులు చెప్పలేను; గాని యీప్రశ్నలే మరి యొకరు వేసిన నేను శాంతమును నిలుపుకొనలేకపోయియుందును. మీరునాకు కేవలము వ్యతిరేకముగ వాదించినను మీమాటలు వినిన నాకు ఆనందమగుచుండును.

సుబ్బా—అయితే నేను అదృష్టవంతుఁడనే.

వేంకట—మీరు మావలె సంఘసంస్కరణవాదు లైతిరా? దేశమంతా మీకు బ్రహ్మరథము పట్టుదురు.

సుబ్బా—అట్లు కాకపోవుటవలనఁగూడ నేను అదృష్టవంతుఁడనే.

దీనికేమి గాని మనకు భోగమువాళ్లవిషయము ఇంకా పూర్తి కాలేదు. దయ చేయండి.

వేంకట—(కూర్చుండి) మీరు భోగమువాళ్లను విడువరు కాఁబోలు.

సుబ్బా—మీరు వాళ్లని బ్రతుకనీయరు కాఁబోలు.

వేంకట—మీమాటలు వింటే నాకు నవ్వు వచ్చును. కానీండు.

సుబ్బా—ఏలూరుపాటి రామదాసుగారి కుమారుఁడు కనకాంగి అనే సానిపిల్లకు కన్నెరికము చేసినాఁడు.

వేంకట—అవునఁట. విన్నాను. ఎంత మంచి కుఱ్ఱవాఁడు చెడిపోయినాఁడండీ?

సుబ్బా—అందుకే నేను విచారించుచున్నాను.

వేంకట—మఱి భోగమువాళ్లు ఉండా లంటారు?

సుబ్బా—ఎందుకు ఉండఁగూడదు? ఎవఁడో ధనయౌవన మత్తుఁడు ఇట్లు అగు నని మనము విద్యలను చంపుకొందుమా?

వేంకట—మొదటినుండియు మీవాదము చాల గడుసుదనముమీద నేయున్నది. ముఖవిధానము చేయుటకు మంచి యుక్తి పన్నినారు. విద్యను మాటుపెట్టి వారకాంతల వ్యభిచారమును సమర్థించుచున్నారు మీరు.

సుబ్బా—మీరు ఆలోచించి మఱీ మాట్లాడుట మంచిది. వ్యభిచారము మంచి దని సమర్థించుటకు నాకేమి పట్టినది?

వేంకట—క్షమింపవలెను. అదిగాదు నాయభిప్రాయము.

సుబ్బా—మఱి విద్యలు నశింపఁగూడ దనుట తప్పా? మన కళలు అన్నీ నశించిపోయిన వని యిపుడు దేశీయులు అనేకులు చింతించుచున్నారు. నూలు వడకుట, అద్దకము, నగిషీపని, చిత్రములు వ్రాయుట, చెక్కుట, ఇఁక నిట్టి సకల కళలను పునరుద్ధరింపవలె నని అందఱును చెప్పుచున్నారు.

వేంకట—కళలను తప్పకుండ ఉద్ధరించి తీరవలెను. దేశాభిమానియైన వాఁడు మున్ముందు చేయవలసిన దిదియే

సుబ్బా—మీమాటలు వినిన నాకు నవ్వు వచ్చును. పెండ్లికిఁబోవుచు పెండ్లి కూఁతురును మఱచి పోయినారఁట. కళలను ఉద్ధరింపవలెనంటారు మీరు. అయితే మీరు దేనిని ఉద్ధరింపవలెననుచున్నారో ఆకళలలో అభినయముకంటె గొప్పది యేదో చెప్పండి. మనసాహిత్యముయొక్క మార్గము వేఱు. ఇపుడు ఈసంస్కరణ పరాయణులకు ఆంగ్లేయమే గాని స్వకీయము తెలియకపోవుటచేత అభినయమును అర్థము చేసికొనలేకుండ నున్నారు. ఒకమాఱు వ్రతభంగమునకైన నంగీకరించి వారకాంతలను మట్టుపెట్టఁజూచుచున్న యీసంస్కరణపరాయణు లందఱును పేరుపొందిన వేశ్యచే అభినయము చేయించి చిత్తగించిన బాగుండును. అప్పు డయిన వారికి తాము ఎట్టి మనోహరమయిన కళను నాశనము చేయుటకు దీక్ష పూనినదియు అట్లు చేయుట ఎంత అనాలోచిత కృత్యమైనదియు తెలిసివచ్చును.

వేంకట—మీరు చెప్పినది నిజమే కావచ్చును. అయితే అభినయమునకు వ్యభిచారసంపర్కము కలుగుచున్నది. అదే మేము వలదనుటకు కారణము. బోగము మేళములు చూచుటవలన అనేకుల మనస్సులు చలించిపోవచ్చును. కేశవరావువంటి యువకులు పాడయిపోవుచున్నందుల కయిన మీరు వగవరు.

సుబ్బా—కావలసినంత వగచుచున్నాను. బోగమువాళ్లవంటి ప్రత్యేక జాతి లేని ఇతరదేశములలో యువకు లెందఱు చెడిపోవుట లేదు? ఏమి చేయవచ్చును? రామశాస్త్రిలుగారు బెల్లపువర్తకములో నేలమట్టము అయినారు. ఇతరులు అవృత్తిని మానినారా? కొండమాచార్యులుగారి కోడలు దూదేకుల వానితో లేచిపోయినది. మొదటిభార్య ఇట్లయ్యెనని ఆయన కొడుకు రెండవ పెండ్లి మానుకొనియెనా? మీ రేది మంచి దందురో దానియందు మంచికంటె చెడ్డ అధికముగ నున్నది. దేనిలో చెడుగు లేదో మీరు చెప్పండి.

వేంకట—అవును.

సుబ్బా—మనదేశమున బోగమువాండ్రు ఉన్నారు.

వేంకట—తప్పతిప్పలుగా.

సుబ్బా—ఇతరదేశములలో వ్యభిచరించు స్త్రీలకు పెద్దపెద్ద కంపెనీలు ఉన్నవి.

వేంకట—అవును. విన్నాను. మాబావ చెప్పినాఁడు. అదిమఱీఘోరము.

సుబ్బా—ఏమి? ఇతరదేశములలో మన భోగమువాళ్లవంటి ప్రత్యేక జాతిస్త్రీలు లేని లోటు తీఱినదా?

వేంకట—(యోచించి) అవునండీ. ప్రపంచమునందలి సకలజాతుల వారి యాచారములకు సమన్వయము చేయుద మన్న అంధకార బంధుర మగు పాడు నూతిలో కూలినట్లగుచున్నది. యోచించిచూడఁగా "భారత దేశమునకు ప్రత్యేకత యున్న" దని మీరు చెప్పినమాటలో యథార్థముకాన్పించుచున్నది.

సుబ్బా—సంతోషము.

వేంకట—ఇతరదేశములవారు తమ యాచారములే యెట్లు మంచివని భావించుచున్నారో అట్లే మన యాచారములుగూడ మంచి వను భావనతో ఇతరుల యాచారములను పరిశీలించిన అనేకములు ఏవగలిగించునవి గలవు.

సుబ్బా—మనలను జూచి వారు మార్చుకొనుచున్నారా?

వేంకట—లేదు. పోషించుకొనుచున్నారు.

సుబ్బా—ఏల?

వేంకట—స్వధర్మ మని. దేశమున పారంపర్యముగ నున్న ఆచారమని. ధారావాహికముగ వచ్చు సాంప్రదాయ మని.

సుబ్బా—అవివేకము మనకు వలదా?

వేంకట—తెలియుచున్నది. మన సంస్కర్తల దృష్టి కేవలము పశ్చిమాభిముఖమై యున్నది. భోగమువాళ్లవిషయమునందే గాదు. సకలవిషయములయందును మనవారు బహిర్ముఖులుగ నేయున్నారు. ఇంకను అంతర్ముఖులు కాలేదు.

సుబ్బా—మీహృదయమున ఇదివఱకే ప్రజ్వలించియున్న దీనుకొనిన జ్ఞానజ్యోతి ఇప్పుడే ప్రారంభ మైనది.

వేంకట—అవును. తెలియుచున్నది. తలంచికొనిన సిగ్గగుచున్నది. నేను గూడ సంస్కర్తనే. సంఘము ఇన్నేల నిర్మింపఁబడినదో తెలియదు. తెలిసికొనుటకు ప్రయత్నము లేదు. సంఘమును దిద్దుటకు మాత్రము మహోత్కంఠ్యమున్నది. ఎక్కడ దిద్దవలెనో, ఎట్లు దిద్దవలెనో, ఏల దిద్దవలెనో, ఎట్లు దిద్దిన ఎట్లు పరిణమించునో తెలియదు. దిద్దఁబడిన ఆచారములు ఎదురుతిరిగి మీఁద పడుచుండుటగూడ తెలియుట లేదు.

సుబ్బా—చిత్తము.

వేంకట—నా తప్పు తెలిసినది. నా యపరాధము బోధపడినది. ఈజ్ఞానోత్పత్తికి ఉదాహరణముగ ఇప్పుడే స్వామిని సేవించెదను. ముందు సంధ్యావందనము చెప్పండి.

సుబ్బా—దయచేయండి. మీకు స్వధర్మాసక్తి కలిగినందులకు ఆనందము. ఇఁక సంస్కర్తశిఖామణులు కొందఱు వారకాంతలకు దాసులైయుండుట మీకు ప్రత్యక్షముగ చూపవలసియున్నది.

వేంకట—అవును. అది నాకు గొప్ప సందేహమే.

సుబ్బా—నాలుగుదినములలో తీర్చెదను. దయచేయండి. సంధ్యావందనము చేసికొందము.

తెరదించవలెను.

---

## పంచమాంకము—తృతీయరంగము

——::○::——

కేశవరావు గృహము

(తివాసీలమీద కూర్చుండి గోపాలశాస్త్రి వేంకటరాయఁడు ప్రవేశింతురు)

గోపాలశాస్త్రి—అస్తు; గాని వెంకమ్మగారు లేకున్న వ్యవహారములు ఇంత సులక్షముగా తేలకపోవును.

వేంకట—అవును. ఆయన రాత్రింబగళ్లు నిద్రాహారములుగూడ సరిగ చూచుకొనుట లేదు.

గోపాల—మంచివాఁడు.

వేంకట—కాకున్న పెదతండ్రి మనుమఁడు చెడిపోవుచున్న ఇంత బెంగ యేదాయాది కుండును?

గోపాల—రామదాసుగారుగూడ వెంకయ్యగారి కన్నులు చూచినారు. ఆయన వెంకయ్యగారిని, కేశవరావును ఒక్క భావముతో చూచినారు. వెంకయ్యగారు ఆవిశ్వాసమును చూపుచున్నారు.

(అప్పుడు ఏలూరుపాటి వెంకయ్య ప్రవేశించును)

గోపాల—దయచేయండి. మీ సౌజన్యమునే మనసము గావించుకొనుచున్నాము.

వెంక—మీరు పెద్దలు. నావిషయమునఇట్లుమాట్లాడుటధర్మముగాదు.

గోపాల—పెద్దవాఁడను; గావున ఆశీర్వచించుచున్నాను.

వెంకయ్య—చిత్తము. అదే నాకు కావలసినది. మఱి ప్రకృతము. కేశవరావు శాస్త్రియింట నున్నట్లు ఆమాకే తెలిసినది. ఇఁక క్షణములో తెచ్చెదను; గాని ముందు నేను శివాలయమునకు పోవలయును. బ్రహ్మానంద భారతీస్వాములవారు వచ్చి కబురు చేసినారు.

వేంకట—(తండ్రితో) జ్ఞాపక మున్నదా? బ్రహ్మానందభారతు లంటే రామదాసుమామగారు.

గోపాల—(శిరము ఊపి) అవునవును. బావగారు తొందరపడి రసాభాసము చేసినారు. పోయి తీసికొనిరండు.

వెంకయ్య—(చేతులు జోడించికొని) ఒక ప్రార్థన. వారు ఇక్కడ స్నమకామము చేయుటకు వీలు లేదుగదా? మాయింట భిక్ష చేయుదును. మీరు ఉభయులు అక్కడకు దయచేయవలెను.

గోపాల—చిత్తము. అందుల కేమి అభ్యంతరము? నాకు మేడమీఁద

కొంచెము పని యున్నది. సెలవు. (వెడలిపోవును)

వెంకయ్య—మాపుగారూ, వ్యవహారముచాలవఱకు తేలిన దన్నమాట. స్వాములవారిని తెచ్చిన ఉత్తరక్షణమున కేశవరావు తమ సన్నిధి నుండును. కేశవరావు ఉంచుకొనిన కనకాంగి మేళము ముగించుకొని కాకినాడనుండి రైలుదిగి వచ్చుచుండఁగా ఊరికి అర్ధమైలుదూరములో దొంగ లడ్డుకొని కొట్టి కట్టుగుడ్డలదగ్గరనుండి దోచుకొన్నారు. సుబ్బిశెట్టికొడుకు రంగయ్య రహస్యముగా కనకాంగిని కాకినాడలో వశపఱచుకొన్నాఁడట.

వెంకట—ఇది మనకు శుభవార్త.

వెంకయ్య—ఏల!

వెంకట—ఈసంగతి తెలిసిన కేశవరావు మఱి దానిని చూడఁడు.

వెంకయ్య—వాని స్వభావ మట్టిదే. కనకాంగి రంగయ్య ఒక బండిలో నున్నారఁట. దెబ్బలకు జడిసి సాని నగ లన్నీ యిచ్చివేసినదఁట. రంగయ్య బీరములు పలుకఁగా చావుదెబ్బలు కొట్టి విడిచిపెట్టినారు దొంగలు.

వెంకట—శాస్త్రి) ఏమయినాఁడు?

వెంకయ్య—వానికి చేయి విరిగినది.

వెంకట—ఇఁక కేశవరావు చెప్పుదెబ్బలు కొట్టును. తప్పదు. ముందు మనము జాగ్రత్తపడవలెను.

వెంకయ్య—ఎట్లు?

వెంకట—ఈయూరున సర్కిల్ ఇన్‌స్పెక్టరెవఁడు?

వెంకయ్య—సాహేబుగారు. పేరు రహిమాన్ ఖాన్.

వెంకట—ఇతఁడేనా? అయితే మనకు బాధ లేదు.

వెంకయ్య—ఏమి?

వెంకట—ఇతఁడు నన్ను నమ్మిన శిష్యుఁడు. ముందుగ మీరు ఆతనివద్దకు వెళ్లి నేను ఈయూరున ఉన్నానని యీపనిమీఁద వచ్చితి నని సంగతి యంతయు చెప్పి మఱిపొండు.

వెంకయ్య—అయితే మూఁడో మేలు. పనిచే వెళ్లుచున్నాను.

పేఁకట—చిత్తము.

తెర దించవలెను.

---

## పంచమాంకము—చతుర్థరంగము



నారాయణశాస్త్రియిల్లు

(పూర్వపుగదిలో కేశవరావు ప్రవేశించును)

కేశవ—(స్వగతము) కనకాంగిమేళమునకు వెళ్లి నేఁటికి వారముపూర్తి యైనది. ఇంకను రాలేదు. శాస్త్రిగూఁడ రాలేదు. మేళముమీఁద మేళముగలి యుండునా? రంగియ్య—తప్పితే మఱియొకఁడు నిలిపివేసెనా? ఏమయినను ఫలమొక్కటే. కనకాంగి చెప్పుట యేమో యథార్థము. అంటే ఇప్పటికి నన్ను దుర్దృష్టదేవత విడిచిన దన్నమాట. దాని కేమి? అది దాని కులవిద్య. శాస్త్రి కేమి పోగాలము వచ్చినది? (తలయూపి) సరే. నేఁడు—తప్పితే రేపు వాళ్లు వత్తురుగదా? అంతవఱకును నాకు ఈవిచార మేల? (అని పుస్తకముతీయును)

నేపథ్యమున

౧. దండాలు బాబయ్యగారూ, రాత్రి ప్రాణాలుపోయేదే బాబయ్యా. ఇంకా యేలినోరిపాదాలు కొలుచుకోటానికియోగంవుండడంచేత ఈఘనానికి ఇలా వున్నాను.

౨. ఏమిరా సంగతి?

కేశవ—(స్వగతము) మావెంకయ్యబాబుకంఠస్వరమువినవచ్చుచున్నది. ఇప్పటికి మావాళ్లు నాకొఱకు వెదకుచుండుట తెలిసినది. ఎదుటికి బోదునా?

నేపథ్యమున

౧. రాత్రి పదకొండుగంటల బండిలో కనకాంగి మేళం దిగిందండి. మూఁడుబళ్లు కుదిర్చేరు. సగందారిలోనికి వచ్చేటప్పటికి పదిమంది దొంగలు

కత్తులలోటే, కత్తులతోటీ అడ్డుకొన్నారండి.

వి. ఏమి జరిగినది?

కేశవ—(స్వగతము) దోచుకొన్నారా యేమి? రాత్రియే వచ్చిన నాకేల తెలుపలేదు? శాస్త్రి యింటి కేల రాలేదు?

నేపథ్యమున

గ. అందర్నీ చితకకొట్టేరండి. బళ్ళోళ్ళకి కూడా తగిలేయండి బాబయ్యా దెబ్బలు. నాకు ఈపుమీద తట్టు లేచిందండి.

వి. నీబండిలో ఎవరున్నారురా?

గ. కనకాంగి రంగయ్యసెట్టిగారు ఉన్నారండి.

కేశవ—(ఉలికిపడి స్వగతము) ఏమి? రంగయ్యయేనా? తలంచినది యథార్థమైనది. కనకాంగి ఇంక ఏమయిన నగుంగాక.

నేపథ్యమున

గ. కనకాంగిని, రంగయ్యగారిని వద్దంటూంటే నారాయణశాస్తుల్లుగారు నాబండిలో ఎక్కించేరండి.

కేశవ—(స్వగతము) ఇది శాస్త్రి పనియే.

నేపథ్యమున

గ. కనకాంగి జడిసి నగలన్నీ యిచ్చేసిందండి. రంగయ్యగారు మాత్రము "ఎవడ్రా" అనేటప్పటికి పడిపోయేయండి కత్తిదెబ్బలు. ఆయనకి తలమీద గాయమైందండి. కాలిరిగిందండి.

వి. ఇంక నెవరెవరికి తగిలినవిరా దెబ్బలు?

గ. పిడేలోటిబద్దలాసిపోయిందండి. మద్దెల చెక్కలై పోయిందండి. పాపముక్క చితకి పోయిందండి. ఇంకో సానిదవడపొంగిపోయిందండి. నారాయణశాస్తుల్లంగారి చెయ్యిరగిందండి. దొంగలుదమ్మిడీకూడా లేకుండా—సల్ల పూసలకాణ్ణుంచీ దోచుకొన్నారండి బాబయ్యా.

కేశవ—(స్వగతము) శాస్త్రికి ఆశిక్ష చాలదు. నేను పూర్తిచేసెదను.

నేపథ్యమున

౨. ఇంక నేమిరా?

౧. అర్ధరాత్రి కాడేటికీ రల్లిపోయిందండి. యెంట నే పోలీసోరొచ్చి శేరండి.

౨. ఇప్పుడు నీవు ఎక్కడకు రా?

౧. నాబండిచక్రం ఇరిగిపోయిందండి బాబయ్యా. ఏకీనవారితో చెప్పుకొని పదిరూపాయలు ఐదు లిట్టుకుపోదా మని బయలుదేరేనండి. ఇక్కడ వున్నారేం బాబూ?

౨. మావస్తువు ఒకటి తప్పిపోయినదిరా. వెదకుటకు వచ్చినాను.

౧. ఎవఁడు తీసేఁడు బాబయ్యా? ఎక్కడనున్నా ఆడిగుండెలు పఁగల్దన్ని తీసికొస్తాను సెలవీయండి దొరగారూ,

కేశవ—(స్వగతము) హా, మావాళ్లియవస్థ. ఇంకనుదాటూ? (ప్రకాశము) బాబయ్యా, మీవస్తువు ఇక్కడ నున్నది. (అని తలుపు తీయుచు)

(వెంకయ్య బండివాఁడు లోపల ప్రవేశింతురు)

వెంకయ్య—(కేశవుని కౌఁగిలించుకొని) ఎన్నాళ్లకు దొరకినదీ? కళ్లు చల్లఁబడినవి.

కేశవ—(విచారముతో) పాపాత్ముఁడను. పశ్చాత్తాపము గలిగినది. క్షమింపవలెను.

వెంకయ్య—నాయనా! క్షమించుట కేమున్నది? విచారించకు.

కేశవ—బాబయ్యా, లక్ష్మి బ్రతికి యున్నదా?

వెంకయ్య—కొనయూపిరితో.

కేశవ—(నెత్తిమీదబాదుకొని) ఎంత దుర్మార్గుఁడను.

సీ. కనలేవొ సింగార మని ముందునకు వచ్చి
మొసిమొసినవ్వుల మురియు బాల
వినలేదొ యని కోర్కి "వినరు? వినరూ" అంచు
మాటిమాటికి బతిమాలు గోల

పిలుతునో యని ముందె "సెల వేమి" యని భావ
మెఱిఁగి కోర్కెలు ఘటియించు లోల
కినిసెదవో యంచు పణఁకుచు బెంబేలు
పడి నాయురమ్మున ప్రాలు జేల
గీ. తపసు చేసిన దొరకని తరుణి, కులము
పూత మొనరించు నిల్లాలు, ముద్దులాడి
సేవలో నండ త్రోసివచ్చితిని; మఱల
పాపకర్ముఁడ మొగ మెట్లు చూపువాఁడ?
వెంకయ్య—అబ్బాయీ, మఱియొక సర్వనాశము సంభవించినదోయీ!
కేశవ—(ఆత్రముతో) ఏమిటి బాబయ్యా?
వెంకయ్య—మీ నాయనగారు సన్న్యసించినారు.
కేశవ—హా, తండ్రీ, (అని క్రిందఁబడి)
సీ. జనకుని సర్వనాశము గోరి వీఁడని
పించుటకై సన్న్యసించినావె?
పాపకర్ముఁడు ప్రేమ చూపరా దని నిశ్చ
యించి ధీయని సన్న్యసించినావె?
పరలోకములకు నాపట్టని బంధమ్ము
త్రెంచికొంటకు సన్న్యసించినావె?
నాయధః పతనమ్మునకు సమగ్రతఁ గూర్ప
నెంచి చట్టున సన్న్యసించినావె?
గీ. అనుఁగుకోడలు, లక్ష్మి, చూలాలు, పౌత్రు
నెత్తుకొనునంతపటుకేని చిత్తవృత్తి
పశమునం దుంచుకొనక యీపగిది భ్రాంతి
పడితి వేటికి? తొందరపడితి వేల?
వెంకయ్య—కేశవా, ఇఁక నెందులకు? ఎంత వగచినను ప్రయోజనము
లేదు. లెము.

కేశవ—(లేచికూర్చుండి) బాబయ్యా, వారు ఉన్నారు; గానింక "నాయనగారూ" అని పిలుచుటకు లేదు. మా ముసుఁజాముము నాయనగారి నెంత దూరము చేసికొన్నాను? ఎంత నిర్భాగ్యుఁడ నైతిని!

వెంకయ్య—అబ్బాయీ, ఈలోప మింక తీఱునది గాదు. ఈసంగతి నీకు తెలియనిదా?

కేశవ—వారెక్కడ సన్న్యసించినారు?

వెంకయ్య—కాశీలో.

కేశవ—(లేచి నిలిచి) అవును. నేను మదరాసునుండి వచ్చునపుడు ఏబండిమీఁద దిగినానో ఆబండిమీఁదనే వారు బయలుదేఱినారు. గ్రహింపలేకపోయితిని.

వెంకయ్య—నేఁటి ఉదయమే వారు మాయింటికి వచ్చినారు. నేఁడు మాయింట భిక్షు నైనది.

కేశవ—ఇది మఱీ విచారకరము.—అవును. ఇఁక నేమి లాభము? అనుభవింపక తప్పదు. బాబయ్యా, భోజనము లైనవా?

వెంకయ్య—ఎంత సేపు నాయనా? నీకు భోజన మైనదా?

కేశవ—చలిదిభోజన మయినది. ఇఁక నిక్కడ నెందులకు? కొన్నిసిత్తనీ వారి సన్నిధికే వచ్చెదను. నాకు ఆవేదన పుట్టి అయిదు దినము లయినది. ఒక పనినిమిత్తము ఇక్కడ నుండిపోయినాను. (చెవియొగ్గి ఆలకించి) శాస్త్రి వచ్చుచున్నాఁడు. మీరిద్దరు నీగదిలో నుండుఁడు.

(వారు గదిలోనికిఁ బోవుదురు)

కేశవ—(స్వగతము) చెప్పులు వదులుగా నున్నవా లేవా? (చూచి) సమయము గ్రహించియే యున్నవి.

(అప్పుడు నారాయణశాస్త్రి ప్రవేశించును)

నారాయణ—(కేశవునిఁజూచి) క్షేమముగదా? సంగతి యంతయు దెలిసినదా?

బండివాఁడు—(తటాలున ఇవ్వలకు వచ్చి సుబ్బయ్యకు ఎదురుపోయి) నోరెత్తితే పళ్లూడఁగొడతాను. కదిల్తే గుండెలు పగలదన్నుతాను.

సుబ్బయ్య—(తెల్లపోయి నిలిచిపోవును)

వెంకయ్య—(సుబ్బయ్యను చూచి) ఒకసారి నీకు మంగళహస్తకాలు అయినవి. చాలదా?

బండివాఁడు—సెలవియ్యండి దొరగారు.

వెంకయ్య—అందుమందరా. నానిగాఁడిదా నీసొము?

కేశవ—బాబయ్యా, (నారాయణశాస్త్రిని చెప్పుల కాళ్లతో దొర్లించి) వీఁడు బ్రాహ్మణచండాలుఁడు. తాఁకగూడదు. ఇఁక పోదమా?

వెంకయ్య—రా నాయనా.

కేశవ—శివాలయమునకుఁ బోయి స్వామిదర్శనము చేసినఁగాని నేనింటికి రాఁగూడదు.

వెంకయ్య—అక్కఱలేదోయి. సాలగ్రామతీర్థ మిచ్చెదనులే.

కేశవ—సరే.

(కేశవరావు, వెంకయ్య, బండివాఁడు నిష్క్రమింతురు. శాస్త్రి లేచి కూర్చుండును. సుబ్బయ్య సమీపించును)

నారాయణ—తమ్ముఁడూ. ముందు ఆసుపత్రికి వెడదాము.

సుబ్బయ్య—తరవాత?

నారాయణ—మేస్త్రీటుకు చేరికే. కనకాంగినాచేతి బొమ్మయైయున్నది మేస్త్రీటు రంగోలీపురుషుఁడు. కేశవరావునకు ఖైదు తప్పదు.

తెరదించవలెను.

---



# షష్ఠాంకము — ప్రథమరంగము

——::O::——

## కేశవరావుగృహము

(తివాసీమీద గోపాలశాస్త్రి, వేంకటరాయుడు, బ్రహ్మానందభారతీస్వాములవారు ప్రవేశింతురు)

బ్రహ్మానందభారతి — బావా, నిజముగా నేను తొందరపడినాను. బండి యెక్కుచుండగా కేశవుడు పదిసార్లు పిలిచెను. కోపమును పట్టజాలకపోయినాను. కలకత్తా చేరిన తరువాత "అయ్యో, పలుకకపోయితినే" యని తహతహపడినాను.

గోపాలశాస్త్రి — మనస్సును స్వతంత్రముగా నుంచుకొనలేని పురుషులు సన్యాసపతులా? మీ మాటలు, మీ పిలుపులు, మీ యలజడి ఇవి యేమైన సన్యాసులకు అర్హములై యున్నవా? ఎవరయినం జూచిన భిక్షు గ్రహణం జేయుదురా?

బ్రహ్మానంద — నీవు చెప్పినది నిజమే. అయితే జరిగిపోయినదానికి ఏమి చేయవచ్చును? నేను ఎక్కడికి బిక్షకే పోను. శివాలయముకద్ద మఠము నిర్మించుకొని శిష్యులకు పాఠములు చెప్పుచునుందును. మా వెంకయ్యద్వారా ఇంటిలోని క్షేమసమాచారములు మాత్రము తెలిసికొనకుండ నుండలేను.

వేంకట — మఠములో నుండుటయే మంచిది. తమ దినపాకమునకు కేశవరావు ఏర్పాటు సేయును.

బ్రహ్మానంద — అవును. వాడద్భుతవాడే. వాడు మనయింటి పెత్తనము చూచుకొనుచుండగా పైగా నుండి పర్యవేక్షణము సేయు యోగము మాత్రము నాకు లేకపోయినది. కానైతే యిప్పుడు సంసారభారమంతా వానిమీద నేపడినది. నేను మాత్రము దూరముగా నుండవలసివచ్చినది.

గోపాల — కడచినదితలచి ఏమి లాభము? ఈస్థితి యైనను చెడకుండ చూచుకొనుటయు మంచిది.

(అప్పుడు వెంకయ్య కేశవరావు ప్రవేశింతురు. కేశవరావు అందఱకు సాష్టాంగపడును.)

గోపాల—(లేవదీసి) నాయనా, విచారింపకుము. ఏదో గ్రహము వక్రించుటచే ఇట్లు జరిగిపోయినది.

బ్రహ్మానంద—నాయనా, ఇట్లయిపోయినావు. నేను తొందరపడి నిన్ను ఒంటిగానిని చేసినాను.

వేంకట—బావా, దౌర్భాగ్యదోష కొన్నిమాసములు నిన్ను బాధించినది. దాని శక్తి నశించినది. ఇంక భయము లేదు.

కేశవ—(తలవంచుకొని) పశ్చాత్తాపము కలిగినది. బుద్ధి వచ్చినది. అందఱూ క్షమింపవలెను.

గోపాల—క్షమించుట కేమున్నది? కుఱ్ఱతనము, దుస్సహవాసమును. ఇంత వేగముగా మేల్కొనినందులకు మాకు సంతోషముగా నున్నది.

కేశవ—(తండ్రియెదుటకుఁ బోయి శిరము వంచుకొనియే చేతులు మోడ్చి) "నాయనగారూ" అనుటకుమాఱుగా "స్వామీ" అని పిలువవలసి వచ్చినది. ఇది నాకు స్వయంకృతాపరాధము. మీరిక నెక్కడకూ పోవద్దు. నాలుగు దినములలో శివాలయమునొద్ద మఠము తయారగును. అందు ఉండి మమ్ము కాపాడుచుండఁగోరెదను.

బ్రహ్మానంద—(కేశవుని శిరమునఁ జేయిడి) వత్సా, విచారము వలదు. అట్లే చేసెదను.

గోపాల—(వెంకయ్యతో) బావగారూ, అప్పుడుగాదిప్పుడు చెప్పండి. మీ ఋణము తీర్చుకొనుటకు మార్గమున్నదా?

వెంకయ్య—(చేతులు జోడించుకొని) మహాత్మా, అట్లనవద్దు. నేను చేసిన దేమీ లేదు.

వేంకట—అంతా మీరు చేసినదే. మీరు నడుము కట్టుకొనకున్న కేశవరావు ఇంత సులభముగా తేలకపోయియుండును.

బ్రహ్మానంద—నిశ్చయము చేసికొనియున్నాము.

వెంకయ్య—ఇదే ముఖ్యమైనది.

గోపాల—నాయనా, లక్ష్మి పసిబిడ్డ. మర్యాదగా మసలుకొను మనుము.

బ్రహ్మానంద—బావా, నీవు ఇప్పుడు ఉపదేశింపనక్కర లేదు. మీ వంశమున అంతఃపురమున ఉన్న సుగుణములు అన్నియు ఒక్క లక్ష్మియందే యున్నవి.

వెంకయ్య—ఇంత చిన్న వయస్సులో ఇంత సౌజన్యమును చూడలేదు. మాయింటికి దీపముగా నున్నది లక్ష్మి.

గోపాల—ఇంత స్వల్పకాలములో వివాహసంబంధము పూర్తిగా సంపాదించుకొనిన మా లక్ష్మి అదృష్టవంతురాలు.

వెంకట—బావా, రమ్ము. (కేశవుని చేయి పట్టుకొనును)

కేశవ—బావా, మొగము చెల్లుట లేదోయి.

వెంకట—వెర్రివాడా, మనము చిన్నవాళ్లము. పొరపాటులు వచ్చుచునే యుండును. వెంగ వెట్టుకోకు. (అని కౌగిలించుకొని తీసికొనిపోవును)

వెంకయ్య—స్వామీ, వెంకటరాయుడుగారిని జూచిన నాకు బ్రహ్మానంద మగుచుండును. ఇంత చిన్నతనమున ఇంత సౌజన్యము నెందును చూడము. బుద్ధిలో ఇంతవాడు మరిలేడు.

బ్రహ్మానంద—నీవు చెప్పునది హీనోక్తి గాని అతిశయోక్తి గాదు.

గోపాల—అంతా పెద్దల యాశీర్వాదము.

(అప్పుడు వెంకటరాయుడు ప్రవేశించును)

బ్రహ్మానంద—వెంకటరాయని వెంకయ్యను జూచి) వీరు మాట్లాడు చుండుడు (గోపాలశాస్త్రితో) బావా, నీతో కొన్ని సంగతులు [illegible] యున్నవి. ఇటురమ్ము.

గోపాల—నాతోకంటె మాచిట్టిబాబుతో చెప్పుటమంచిది. అయినా రండు.

(ఇరువురు నిష్క్రమింతురు)

వేంకట—మామగారూ, ఇంక సెట్టిబాకీ నిలిపియుంచుట యెందులకు, వడ్డీనష్టము.

వెంకయ్య—ఋణము ఉంచగూడదు. ఉంచవలసిన పనిలేదు.

వేంకట—మీవద్ద కేమాత్రము చేరినది?

వెంకయ్య—రొక్కము ఐదువందల పైచిల్లర మాత్రమే. బంగారము ఇప్పుడు కదుపవద్దు.

వేంకట—దానిసంగతి తరువాత యోచింతము. తరువాయి ఇచ్చెదను. సెట్టివద్దకుబోయి "కేశవరావువంటికుమారుడు నీకును కలడు. ఎప్పుడుతండ్రి చాటువానికి ఋణము పెట్టవద్దు. అది ముందుముందు సర్వనాశమునకు హేతువగు" నని చెప్పిసొమ్ము ఇచ్చివేసెదరండు.

వెంకయ్య—అక్కఱ లేదు. సెట్టికి ఈయవస్థ చాలదినములక్రిందటనే ప్రారంభమైనది నిన్న రాత్రిపాపపుకుండ బద్దలైనది.

వేంకట—ఈమాట ఉద్ఘాటించి మరీ రండు.

వెంకయ్య—చిత్తము.

తెరదింపవలెను.

---

## షష్ఠాంకము—ద్వితీయరంగము



అంతఃపురము

(సాష్టాంగపడికేశవరావు అతనిని లేవనెత్తుచు లక్ష్మి ప్రవేశింతురు)

లక్ష్మి—అయ్యో, నాకీపాపము నేలఅంటగట్టెదరు? నేను మీయెడల నేమి అపరాధము చేసినాను? (లేవనెత్తును)

కేశవ—(లేచికూర్చుండి) లక్ష్మీ, నేను చండాలుఁడను. ఏమియు నెఱుఁగని నిన్ను యమయాతనపాలుచేసినాను.

లక్ష్మి—(భర్తచేతులు పట్టుకొని) మీరట్లనవద్దు.

కేశవ—నీపాదములంటుటకైన నాకర్హత లేదు. నేను పాపాత్ముఁడను.

లక్ష్మి—నేను మీపాదములు పట్టవలసినదానను. మీరు నాశిరమున మీపాదమును ఉంచవలసినవారు.

కేశవ—అయ్యో, వెఱ్ఱిదానా, నేను నీశిరమున పాదము పెట్టి నిన్ను పాతాళమునకు త్రొక్కివేయలేదా?

లక్ష్మి—మీరట్లనవద్దని మఱల ప్రార్థన. మీరేమి చేసిన అదియే నాకు పరలోకమున ఆధారము.

కేశవ—గోలా, నీయెదుట నిలుచుటకేని నాకర్హత గలదా?

లక్ష్మి—నన్నేల శూలములతో నొప్పించెదరు?

కేశవ—అమృతకలశమును కాళ్లతోఁ దన్నివేసి మద్యభాండమును చేఁబట్టిన అధముఁడను. సిరిని నిరాకరించి పెద్దమ్మనాశ్రయించిన అభాగ్యుఁడను నీపేరు ఉచ్చరించుటకైన నాకు అధికారము గలదా?

లక్ష్మి—అయ్యో, ఇదేమి విపరీతము? ఇంకను నామీద అనుగ్రహము కలుగలేదా? (పాదములు పట్టుకొనును)

కేశవ—లక్ష్మీ, నామీఁదికోపమును మానవా? నాయెడల ననుగ్రహము పూనవా? నన్ను క్షమింపవా?

లక్ష్మి—అకటా! మీమాటలు నేను వినలేను. నాహృదయము బ్రద్దలయి పోవుచున్నది.

కేశవ—లక్ష్మీ, వలదువలదు. నీహృదయమును నేను ఎఱుఁగుదును. ఎఱిఁగియుండియే చెడితిని. నీవు నాహృదయక్షేత్రమున ప్రవహింపఁజేసిన ప్రణయవాహినిలో విషము కలుపుకొన్నాను. అయినను నీవుతొల్లిటి ప్రణయస్వరూపమవే. ఇది నీపుట్టినయింటి మాహాత్మ్యమునకు గుఱుతు.

లక్ష్మి—నేను మీయెదుట మాటలాడఁజాలను. నన్ను ఆయాసపెట్ట వద్దు. నన్ను రక్షింపుఁడు. (మఱలపాదములు పట్టుకొనును)

కేశవ—(చేతులుపట్టుకొని) లక్ష్మీ, వలదు. ఇది నేనుచేయవలసిన పని. మీయమ్మగారు ఎక్కడనున్నారు.

లక్ష్మి—పిలుతునా?

కేశవ—వలదువలదు. నన్నే వారికడకు గొనిపొమ్ము. నన్ను వారి పాదములమీద పడవేయుము. నాయెడల అనుగ్రహము చూపవలసినదనినీవు ప్రార్థింపుము.

లక్ష్మి—పార్వతీ,

నేపథ్యమున

ఏమి తల్లీ,

లక్ష్మి—అమ్మగారి దర్శనమునకు వచ్చుచున్నాము.

నేపథ్యమున

రావచ్చును తల్లీ.

కేశవ—ముందు నీవు నడువుము.

లక్ష్మి—దయ చేయుఁడి. (చేయి పట్టుకొనును)

తెరదించబడెను.

---

## షష్ఠాంకము—ద్వితీయరంగము



వేశ్యావాటిక

(ఒక యింటియెదుట సుబ్బారాయుఁడు వేంకటరావు ప్రవేశింతురు)

సుబ్బారాయుఁడు—వేంకటరావుగారూ,

వేంకట—ఏమి సెలవు?

సుబ్బా—ఒక ప్రయోజనము నిమిత్తము నేఁడు మిమ్ము పోరానిస్థలమునకు తీసికొనిపోవుచున్నాను.

వేంకట—ప్రయోజనము సిద్ధించినచో బెంగ ఉండదు.

సుబ్బా—ఉన్నవానిలో మంచి స్థలము. నాజీవితమున ప్రప్రథమమున ఒక్కమాఱుమాత్రమే గురుదక్షిణ స్వీకరించుట కెచ్చట కరిగితినో అక్కడకే మిమ్ము కొనిపోవుచున్నాను.

వేంకట—అయితే మఱీ సంతోషము.

సుబ్బా—ఇదిగో ఈయిల్లు సుభద్రాచలము అను సానిది. ప్రఖ్యాతి పొందిన సానులలో నిది యొకతె. ఈలోపలకే మనము పోవలయును. దయ చేయండి.

(ఇరువురు గుమ్మమెక్కి లోపల ప్రవేశింతురు)

సుబ్బా—మన మెవరికోసము వచ్చితిమో వారితో మాత్రమే యింటి వాండ్రతో మీరు మాట్లాడ నక్కఱ లేదు.

వేంకట—చిత్తము.

(అప్పుడు సుభద్రాచలము ప్రవేశించును)

సుభద్రాచలము—నమస్కారములు. కూర్చుండవలెను.

(ఆగంతుకులు కూర్చుందురు)

సుభద్రాచలము—ఆలస్యమైనదే యని యెదురు చూచుచున్నాను. ఇంక లోపలకు పోదునా?

సుబ్బా—ఏమి వేంకటరావుగారూ, మీరు సిద్ధముగ నున్నారా?

వేంకట—చిత్తము.

సుబ్బా—ఇటురా. (అని సుభద్రాచలమును కొంచెము దవ్వునకుఁ గొనిపోయి చెవిలో నేమో చెప్పును)

సుభద్రాచలము—(మందహాసము చేయుచు) అయ్యో. సిగ్గులచేటు.

సుబ్బా—తప్పదు. మేము చూడవలసిన స్థితి యదీ.

సుభద్రాచలము—(అర్థాంగీకారముతో) సరే మఱీ. మీయాజ్ఞ తప్పదు నన్ను ముందు పోనిండు. తరువాత అయిదు నిమిషములు తాళుఁడు.

(వెడలిపోవును)

సుబ్బా—నీవే ముందు పొమ్ము. మేముపోయిన నేమున్నదీ? (వేంకట రావును తనవద్దకు పిలిచి) మీరు గదిలో ముందు ప్రవేశింపవలెను. ఇక్కడ నుండుడు. (అని తన ముందు నిలుపుకొనును)

వేంకట—నాకు కాళ్లు వడకుచున్నవి.

సుబ్బా—ఏల?

వేంకట—రారానివోటికి వచ్చితి మని.

సుబ్బా—ఈభయమెప్పుడూ ఉండునట్లు నూచుచున్నాడు. (అంతట ఒక తెఱ లేచును. ఎదుట కుర్చీమీద సాంబశివరావు కూర్చుండియుండును. సాంబశివరావు ఒడిలో సుభద్రాచలము కూర్చుండియుండును. ఒకబల్లమీద తోలుపెట్టె, స్టెతస్కోపు ఉండును)

సుభద్రాచలము—(సరసుని చుబుకము దువ్వుచు) రాజా, నాకు బనారసు చీర కొనిపెట్టవూ?

సాంబశివరావు—అలాంటి విదేశీగుడ్డలు ఇంక పనికిరావు. రాట్నము కొనితెస్తాను. నూలు వడుకుము. చీర నేయింతును.

సుభద్రాచలము—నేను కట్టలేను బాబూ ముతకచీరలు.

సాంబశివరావు—మఱియేమ్నే? విదేశీగుడ్డ కట్టనని నాకు వ్రతం

సుభద్రాచలము—ఇప్పుడేమి కట్టినావు?

సాంబశివరావు—నీపోరు పడలేక నీయింట నున్నంతకాలం గ్లాస్గో కట్టుచున్నాను.

సుభద్రాచలము—కనుక బనారసు చీర కొను. నీవ్రతము నీవు కట్టుకొనిన పెండ్లామువద్ద చెల్లించుకో. ఇక్కడకు పది సంవత్సరములనుంచి సంవత్సరమునకు మూడు బనారసు చీరలు కొంటున్నావు. ఇప్పుడీ వికారమేం? బనారసు చీర రేపు కొనక తప్పదు. ఊఁ. ఇదిగో ఇదే చెప్పడం

సాంబశివరావు—సరేలే. ఏదీముద్దు?

(సుభద్రాచలము బుగ్గ ఇచ్చును. సాంబశివరావు ముద్దుగొనును. ఈ సమయములో సుబ్బారాయుడు వేంకటరావును ముందునకు త్రోసి

తాను వెనుకకుఁ బోవును,

వేంకట—(ధైర్యముగా నిలిచి) శివరావు? (అని పిలుచును)

(సాంబశివరావు వెల్లవోవును. సుభద్రాచలము లేచినిలుచును. సిగ్గుపడిన సాంబశివరావు లేవలేక కూర్చుండియే యుండును)

వేంకట—సాంబశివరావు!

సుభద్రాచలము—(ముంగోపముతో) ఎవరు మీరు?

వేంకట—సాంబశివరావు!

సాంబశివరావు—అసమయమున వచ్చుటయే గాక ఇంకను మొఱదవేల? (కుర్చీలో సరిగా కూర్చుండును)

వేంకట—నీవు ఇక్కడి కేల వచ్చితివి?

సాంబశివరావు—వైద్యునకు. నీవెందుకు?

వేంకట—నిజము చెప్పుము. ఇక్కడి కెందులకు వచ్చితివి?

సాంబశివరావు—నాగరికత తెలియని పూర్వకాలపు మనుష్యునివలె—కోయవానివలె—కొండవానివలె ప్రవర్తించుచున్నావు. (కొంచెము కోపముతో) నీవెందులకు వచ్చితివి?

వేంకట—నిన్ను చూచుటకు (చిఱునవ్వు నవ్వును)

సాంబశివరావు—నేను నీకొఱకే వచ్చి యిక్కడ కనిపెట్టుకొనియున్నాను

వేంకట—తోచినది యిప్పటికి యుక్తి. అయితే ముందు వచ్చి యేమి చేయుచున్నావు?

సాంబశివరావు—ఇంక సహింపఁజాలను. అవతలకు బోయెదవా లేదా?
(కుర్చీమీఁదనుండియే యార్భాటము సేయును)

వేంకట—నీ భేషజములకు నేను జడియను.

సుభద్రాచల—అయ్యా, సానీ, సరసుడూ సరసాలాడుకొనుచుండగా—

సాంబశివరావు—(చేయి జాడించుకొని తనలో) చంపేసిందిరా!

సుభద్రాచలము—ఇట్టి సమయములో వచ్చుటయే గాక పైగా మోటు

మాట లాడెద రేల?

వేంకట—నీకు కోపము వలదు. ఇదే పోవుచున్నాను. క్షమింపుము.

(బయలుదేఱును)

సుభద్రాచలము—(వెంటనువ్వ్మముకఱకును వచ్చి) సరసం తెలియక పోతే సరి. చదువుకోంగానే సరా? ఇలాంటి మొగాలే సానియింటికి రావలసినవి. (అని తలుపు వేసికొనును)

వేంకట—(ఇవతలకు వచ్చి సుబ్బారాయనిఁ గలిసికొనును. సుబ్బా రాయఁడు నవ్వుచుండును)

వేంకట—చాలునిఁక దయచేయండి.

సుబ్బారాయఁడు—తీఱినదా మీ గొప్ప సందేహము?

వేంకట—తీఱినది. ఇక్కడ కాదు. రండి.

(అని యిరువురు వీధిలోనికి వత్తురు)

వేంకట—హాహాహా, ఏమి కాలమండీ. ఏమి పోగాల మండీ వీనికి? సానులను నాశనము చేసెదనని వ్రతము. సానిని ఒడిలోకూర్చుండఁబెట్టుకొని ముద్దులాట. ఛీ, ఎవనిని నమ్మగూడదండీ.

సుబ్బా—మీపుణ్యమూరయె ఈదెబ్బ అందఱమీఁదికి విసరకండి.

వేంకట—అంతా ఇట్టివాళ్లేనంటూరా? వేశ్యాబహిష్కారమునుగుఱించి వైద్యము ప్రారంభించినప్పటినుండి అనగా పన్నెండేండ్లనుండి వీఁడు చేయు ఆర్భాటమునకు మేర లేదు.

సుబ్బా—పదియేండ్లనుండి యీయన ఈవృత్తిలో నున్నట్లు సాని మాటలవలనమీరు గ్రహించియే యుందురు.

వేంకట—అవును. నాప్రాణియముదహించుకొని పోవుచున్నది. గ్లాస్గో మల్లుగూడ కట్టినాఁడు.

సుబ్బా—అది సానియింటి వేషము

వేంకట—వీని పిండాకూడు. మొన్న మదరాసులో జరిగిన కాంగ్రెసు

కమిటీమీటింగులో వేశ్యాబహిష్కారము జనులకు బోధించు నుపాయములను సూచించుటకు ఒక కమిటీ ఏర్పాటుచేయఁబడినది. దానికి వీనిని జనరల్ సెక్రెటరీగా నియమించినారు.

సుబ్బా—చిత్తము.

వెంకట—వీఁడు దొమ్మలాడి ఆపదవి పుచ్చుకొన్నాడండీ.

సుబ్బా—చూచినారా!

వెంకట—ఛీ, వీని బ్రతుకు కాలా.

సుబ్బా—సెల వయితే ఇంకొక చిత్రము చూపెదను.

వెంకట—ఏమిటది?

సుబ్బా—ఈయనకు ఆవీధిని ఒక భోగముది ఉన్నది. ఇది సానిది.

వెంకట—అది యొకటా?

సుబ్బా—ఇది శిష్యురాలు గనుక చెప్పిన మాట వినునని యిక్కడకు తీసికొనివచ్చినాను. అక్కడఁగూడ అభ్యంతరము ఉండఁగూడదు. పోవుదమా?

వెంకట—వలదు వలదు. ఇది చాలును. రెండు మాఱులు పరీక్ష సేయుటకుఁ బోయిన మూఁడవ మాఱు మనస్సు స్వాధీనము తప్పి పోవచ్చును.

సుబ్బా—అవును. తరువాత ఏమనుకొనినను ప్రయోజనము లేదు. మిమ్ము శ్రమము చెఱిపి సానియింటికి తీసికొనివెళ్ళినందులకు క్షమింపవలెను. (చేతులు పట్టుకొనును)

వెంకట—అక్కఱలేదు స్వామీ, మీరు చూపికొనిపోయిన నాకన్నులు తెఱచినారు. లోకములో ఎన్ని చిత్రాలు ఉన్నవండీ!

సుబ్బా—నాయనా, మీరేమి చూచినారు? ఇలాటివాళ్లు నాకండ్ల యెదుట లక్షలైనారు.

సీ. "ఇదె రాజమండ్రి వెళ్లెద" నంచు బండెక్కి
కెళ్వ్రానాకిలి తట్టు క్రీడ రొకఁడు
"పసలింపు, చీల్లాడి కస్తు" నంచు నిశీథి

గణిక యింటికిఁ జేయు కరణ మొకఁడు
"గంధి చెప్పెను గణికలఁ జూడవ" ద్దంచు
స్వేయ ముంచుకొను వలంటీయ రొకండు,
"డ్యూటీ" కటంచిల్లు దాఁటి రాత్రుల, సాని
తో సుఖంబుండు పోలీ సొకండు.

గీ. వైద్యమున కంచు సంస్కర్త, బదులు గొనియొ
కనుగొనెద నంచు కాంగ్రెసుకమిటి కధిపుఁ
డేమొ, యేమో యటం చింక నెంద రౌని
చనుచు నే యుంద్రు బోగాల సరసములకు.

వేంకట—ఎన్ని తమాషా లైన నుండవచ్చును.

సుబ్బా—కావున నామనవి యేమనఁగా? భారతజాతియొక్క సాంప్రదాయము మాఅనంతకాలము వేశ్యాబహిష్కారము సాధ్యము గాదు. ప్రయత్నించినకొలఁది చెడును. దానికొఱకుచేసిన ప్రయత్నమూ, వెచ్చించినధనమూ, గడపిన కాలమూ వ్యర్థములు. మీదేశమున వేశ్యాజాతియనునది ఉండనేగూడ దని తలంతు రేని పాశ్చాత్యుల సంఘనియమముల నన్నిటినీ అవలంబింపుఁడు.

వేంకట—అట్లయిన భారతీయత చచ్చియే పోవును. అది వలనుపడదు.

సుబ్బా—కానిచో ఇది సాధ్యపడదు.

వేంకట—నిశ్చయమే.

సుబ్బా—ఈనిశ్చయజ్ఞాన మిప్పటికైన మీకు కలిగినందులకానందము. దయచేయండి స్వామిదర్శనమునకు వేళ యగుచున్నది.

తెరదించవలెను.

సంపూర్ణము



# వీరపూజ

ఇందు చంద్రగుప్తుడు, పృథ్వీరాజు, భీమసింహుడు, మహారాణాసింహుడు, సంగరాణా, ప్రతాపసింహుడు అను ఆరుగురు భారతీయవీరుల చరిత్రలు గంభీరశైలిలో సవిమర్శముగ వర్ణింపబడినవి. ప్రఖ్యాతిగన్న గ్రంథము. రు. 1—0—0

| | | | |
|---|---|---|---|
| అనాథబాలిక | (నవల) | ... | రు. 0—10—0 |
| శ్మశానవాటిక | ,, | ... | 0—12—0 |
| మిథునానురాగము | ,, | ... | 0—12—0 |
| నాగకాంత | (నాటకము) | ... | 0—12—0 |
| రామదేవవిజయము | ,, | ... | 0—6—0 |
| సాహసిక రాజపుత్రిక | | ... | 0—6—0 |
| పాణిగృహీతా శ్రవణానందశృంఖల | | ... | 0—6—0 |
| విజయనగర రాజుల కథలు | | ... | 0—3—0 |
| చిత్తూరు రాజుల కథలు | | ... | 0—4—0 |
| ఢిల్లీ చక్రవర్తుల కథలు | | ... | 0—4— |
| గోల్కొండ నవాబుల కథలు | | ... | 0—2—0 |

కోరువారికి కేటలాగు ఉచితము

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

కలాభివర్ధనీ పరిషత్తు—రాజమండ్రి